# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి సాంఘిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము

సంపుటము 40 | అక్టోబరు 1997 | సంచిక 10

## విషయసూచిక



ఎడిటర్: వి. కె. నరసింహన్

© శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు, ప్రశాంతినిలయం

సంవత్సర చందా: తెలుగు లేక ఇంగ్లీషు (ఒక్క సంవత్సరమునకు మాత్రమే స్వీకరించబడును)

ఇండియాలో : రూ. 30/-

విదేశాలకు : ఎయిర్‌మెయిల్ - రూ.240/- లేక యు.ఎస్.డాలర్లు 8 లేక యు.కె. పౌండ్లు 5

సీ మెయిల్ - రూ.120/- లేక యు.ఎస్.డాలర్లు 4 లేక యు.కె. పౌండ్లు 3

చందా పంపవలసిన చిరునామా : కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్‌కోడ్ - 515134

సాధారణ సమాచారము: (1) చందాదారుని పేరు, పూర్తి చిరునామా [illegible]

(2) భారత దేశములో ఏ పోస్టు ఆఫీసులోనైనా పత్రిక చందా మనియార్డరు ద్వారాగాని, [illegible] డ్రాఫ్టు ద్వారాగాని [illegible]. (3) [illegible] రెన్యూవల్ చందాయో తెలియపరచవలెను. రెన్యూవల్ అయినచో [illegible] వ్రాయవలెను. (4) [illegible] రెండు నెలలు [illegible] తిరిగి చందా [illegible] పంపవలెను. (5) ఈ పత్రిక శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ [illegible] శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్, ప్రశాంతినిలయంలో ముద్రించబడినది.

ఫ్యాక్స్ : 0091-8555-87236/87390, గ్రామ్స్ : [illegible] టెలిఫోన్ : 87375, [illegible] కోడ్ : 08555, [illegible] కోడ్ : 0091 8555

## 1997 నవంబర్ నెలలో ప్రశాంతినిలయంలో జరుగు కార్యక్రమములు

| | | |
|---|---|---|
| నవంబర్ 8వ తేదీ | : | ప్రపంచవ్యాప్త అఖండ భజన (నవంబర్ 8 సాయంత్రం 6 గంటల నుండి నవంబర్ 9 సాయంత్రం 6 గంటల వరకు) |
| నవంబర్ 22వ తేదీ | : | శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ 16వ స్నాతకోత్సవం |
| నవంబర్ 23వ తేదీ | : | భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి 72వ జన్మదినోత్సవం. |

# వినాయక చవితి విశిష్టత

ప్రేమాత్మస్వరూపులారా!

శివుడే జీవుడు, జీవుడే శివుడు. ఈ ఏకత్వాన్ని ఎవరు గుర్తింతురో వారే పరిపూర్ణజ్ఞానులు. పవిత్రమైన భారతీయ పర్వదినములన్నీ ఆధ్యాత్మిక అంతరార్థముతో కూడినవేగాని కేవలం బాహ్యాచార సంబంధమైనవి కావు. భారతీయులు వినాయకుణ్ణి పార్వతీ తనయుడనీ, గణాధిపుడనీ స్తుతిస్తూ ఉంటారు. పార్వతి శక్తిస్వరూపిణి అనీ, ఆమెకు జన్మించినవాడే గణపతి అనీ భావిస్తున్నారు కాని, దీని అంతరార్థమును గుర్తించడానికి ఎవ్వరూ ప్రయత్నించడం లేదు. పార్వతి అనగా పృథ్వి. కనుక పార్వతీ తనయుడనగా పృథ్వీ పుత్రుడని అర్థం. అర్జునునికి పార్థుడనే పేరున్నది. పార్థుడనగా పృథ్వీ పుత్రుడు. ప్రతి మానవుడు ఈ పృథ్వి నుండి జన్మించినవాడే కనుక ప్రతి మానవుడు పార్థుడే; ప్రతి మానవుడు గణపతియే.

గణపతి అనగా అర్థమేమిటి? ఏమిటీ గణములు? ఎక్కడున్నవి? పంచేంద్రియములు, మనస్సు, బుద్ధి - ఈ ద్వాదశాదిత్యులే గణములని పేరు. వీటికి అధిపతియైనవాడు గణపతి. గ - అనగా బుద్ధి, ణ - అనగా విజ్ఞానము. కనుక బుద్ధి, విజ్ఞానములకు అధిపతియైనవాడే గణపతి. ఇతడు ప్రతి మానవుని యందు బుద్ధిజ్ఞానస్వరూపుడై జీవిస్తున్నాడు.

గణపతి ఆరాధన నిన్న మొన్న ఏర్పడినది కాదు, వేదకాలము నుండి ఇది జరుగుతూ వస్తున్నది. ఋగ్వేదమునందు, నారాయణోపనిషత్తునందు, తైత్తిరీయోపనిషత్తునందు కూడా అనేకచోట్ల గణపతి స్తుతి కనిపిస్తున్నది.

''తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి
తన్నోదంతిః ప్రచోదయాత్''

గణపతి సర్వశక్తి స్వరూపుడనే సత్యాన్ని నిరూపించింది వేదము. ఇతనికి వేరే నాయకుడు లేడు. కనుక, వినాయకుడని ఇతనికి పేరు వచ్చింది. నాయకుడు లేనివాడు వినాయకుడు. ఇతడు మానవునియందు ఆత్మస్వరూపమును ధరించాడు. ఆత్మకు మరొక నాయకుడు లేడు కదా! ఇట్టి వినాయక తత్త్వమును గుర్తించాలంటే మన దృష్టిని అంతర్ముఖం గావించుకోవాలి.

ఈనాటి విద్యార్థులు వినాయకుణ్ణి అనేక విధాలుగా ప్రార్థిస్తున్నారు. దేనికోసం? ఈ ప్రాకృత విద్యలందు తాము ఉత్తీర్ణులు కావాలని, గొప్పడిగ్రీలు అందుకోవాలని. అసలు విద్య అనే పదము చాల పవిత్రమైన అంతరార్థంతో కూడినది. కనుక ఈ లౌకిక చదువును విద్య అని చెప్పకూడదు. సకల శక్తి సంపన్నమైన తత్త్వమునకే విద్య అని పేరు. దీనినే అవేర్‌నెస్ (Awareness) అన్నారు. 'అవేర్‌నెస్' అనగా అంతో ఇంతో తెలుసుకోవడం కాదు, పరిపూర్ణ జ్ఞానమే 'అవేర్‌నెస్'. ఇట్టి జ్ఞానంకోసమే వినాయకుణ్ణి ప్రార్థించాలి కాని, ప్రాకృతమైన డిగ్రీలకోసం కాదు. విద్య అనేది Way of life. నడవటం విద్యనే, మాట్లాడటం విద్యనే, తినటం విద్యనే, ఆలోచించటం విద్యనే, కట్టకడపటికి మన శ్వాసను ఏవిధంగా వదలాలనే విషయాన్ని తెలుసుకోవడం కూడా విద్యనే. మానవుని జీవితమంతా విద్యాస్వరూపమే! ఇట్టి విద్యను గుర్తించడానికి ప్రయత్నించే వాడే నిజమైన విద్యార్థి.

విద్ అనగా జ్ఞానము. కనుక ఏది జ్ఞానము నందించునో అదియే విద్య. "అధ్యాత్మవిద్యా విద్యానాం" అన్నాడు కృష్ణుడు. ఇట్టి విద్యను నేర్పేవాడే వినాయకుడు.

**పక్షపాతం చూపిన నందికి పార్వతి శాపం**

ఒకానొక సమయంలో పార్వతీపరమేశ్వరులు పాచికలాడుతున్నారట. అందులో ఎవరు ఓడారో, ఎవరు గెలిచారో చెప్పడానికి ఒక జడ్జి ఉండాలి కదా! పార్వతే ఎన్నుకుంది నందీశ్వరుణ్ణి జడ్జిగా. ఆటలో పార్వతి గెలిచింది. కాని నంది ఈశ్వరుడే గెలిచాడని తీర్పు చెప్పాడు. పార్వతికి కోపం వచ్చింది. అప్పుడు నంది, "తల్లీ! ఈశ్వరుడు నా ప్రభువు. అతడు ఓడితే నేను కూడా ఓడినట్లే కదా! కనుక, నా యజమాని గెల్చినట్లుగా చెప్పడం నాకర్తవ్యం" అన్నాడు. అప్పుడు పార్వతి మరింత కోపంతో, "నందీ! నీవు నయంకాని రోగంతో పీడింపబడుదువు గాక!" అని శపించింది. వెంటనే నందీశ్వరుడు ఆమె పాదాలపై పడి, "తల్లీ! నేను చేసింది తప్పే! దయచేసి నన్ను క్షమించి నాకీ శాపం నుండి విముక్తి పొందే మార్గాన్ని తెలియచేయ వలసింది" అని ప్రార్థించాడు.

**వినాయక పూజతో నందికి శాపవిమోచనం**

పార్వతి కనికరించి, "చూడు నందీ! త్వరలో నా కుమారుని పుట్టిన పండుగ వస్తున్నది. ఆ రోజున నీకిష్టమైన పదార్థమును నా కుమారునికి అర్పితం చేయి. అతని అనుగ్రహంతో నీకు శాపవిమోచనమవు తుంది" అన్నది. అప్పుడు నంది బాగా ఆలోచించి, తన కిష్టమైనది పచ్చని గరిక కాబట్టి దానిని వినాయకునికి అర్పితంచేశాడు. నంది తనకు ప్రీతికరమైనది వినాయ కునికి ఇచ్చాడు. కాబట్టి వినాయకుడు కూడా తనకు ప్రీతికరమైనది నందికి అందించాడు. అప్పుడు నందికి శాపవిమోచనం కల్గింది. కనుకనే మనం వినాయక పూజను ప్రత్యేకంగా గరికెను ఉపయోగించి చేస్తున్నాము. ఇంతేకాదు. తెల్ల పూలు, ఎర్రని పూలు, మారేడు పూలు మొదలైన వాటితో వినాయక పూజ చేస్తు న్నాము. ఇవి మనకేమాత్రము పనికిరావు. ఇలాంటి వాటిని భగవంతునికి అర్పించి మనకు ఉపయోగమైనవి, ఇష్టమైనవి, మనకు ఎంతో శ్రేష్ఠంగా తోచేవి భగవం తునికి సమర్పించాలని అనుకుంటున్నాము. మనం త్యాగ మయోగంతో చెప్పుకున్నట్లు మనకు ఎక్కువ ప్రీతిక మైన ఫలమునో, పదార్థమునో అర్పించి భగవంతునికి సమర్పించినప్పుడే సంతోషము చెందుతాడు. కాని ఈనాటి కలియుగమానవులు, తమకు ఏది పనికిరాదో, ఏది ఇష్టం లేదో దానిని మాత్రమే భగవం తునికి ఇచ్చి తమకు ఇష్టమైన కోరికలు కోరుతున్నారు. ఇష్టంలేని కాయకూరలను దైవానికి సమర్పించి తియ్యని ఫలితములను ఆశిస్తున్నారు. ఇది సరియైన అర్పితం కానేకాదు. వేదాంతము, "యద్భావం తద్భవతి" అన్నది. మన భావం ఎట్లుంటే ఫలితం కూడా అట్లుగానే ఉంటుంది.

**గజాసుర వృత్తాంతము**

ఒకానొక సమయంలో గజాసురుడు గొప్ప తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమై ఏమి వరం కావాలో కోరుకొమ్మన్నాడు. ఈశ్వరుడు సులభప్రసన్నుడు. ఇతనికి భోళాశంకరు డని పేరు. తనను పొగిడితే చాలు. అప్పుడే ప్రసన్నుడై పోతాడు. గజాసురుడు శత్రువులు తన సమీపానికి రాకుండా ఉండేటట్లు తన నుండి అగ్ని ఉద్భవించాలని కోరుకున్నాడు. ఈశ్వరుడు 'తథాస్తు' అన్నాడు. గజా సురుడు మళ్ళీ తపస్సు చేశాడు. ఈశ్వరుడు మళ్ళీ అత నికి దర్శనమిచ్చి, "గజాసురా! ఇంకా ఏమి కావాలి?" అని అడిగాడు. గజాసురుడు, "ఈశ్వరా! నీవు నా

ఉదరంలో ఉండిపోవాలి" అన్నాడు. ఈశ్వరుడు సరేనని అతని ఉదరంలో ప్రవేశించాడు. అక్కడ కైలాసంలో పార్వతి ఈశ్వరుని కోసం ఎంతగానో వెతికింది. కాని ఈశ్వరుడు ఎక్కడా కనిపించలేదు. వెంటనే ఆమె విష్ణువు వద్దకు పోయి, "మీ బావగారు ఎక్కడున్నారో ఏమో నాకు కనిపించడం లేదు" అని బాధపడింది. విష్ణువు, "పార్వతీ! నీ భర్త భోళాశంకరుడు, భక్తసులభుడు; అడిగినవారికి లేదనకుండా వరాలిస్తుంటాడు; ముందు వెనుకలు యోచించడు. ఈవిధంగా ఎవరికో వరమిచ్చి ఎక్కడో చిక్కుకొని పోయుంటాడు. నీవేమీ విచారించవద్దు. నేను పోయి తీసుకువస్తాను" అన్నాడు.

సరే, జగన్నాటక సూత్రధారియైన విష్ణువు ఇక్కడొక చిన్న నాటకాన్ని ప్రారంభించాడు. నందిని ఒక గంగిరెద్దులా అలంకరించి మేళతాళాలు వాయించుకొంటూ గజాసురుని వద్దకు తీసుకెళ్ళాడు. అతని సమక్షంలో నంది వర్ణనాతీతంగా నృత్యం చేసింది. గజాసురుడు మెచ్చుకొని, "అయ్యా, గంగిరెద్దుదాసూ! నీకేమి కావాలో అడుగు" అన్నాడు. "నేను అడిగింది నీవివ్వగలవా?" అని ప్రశ్నించాడు గంగిరెద్దుదాసు వేషంలో ఉన్న విష్ణువు. ఏదడిగినా ఇస్తానన్నాడు గజాసురుడు. "ఐతే నీ ఉదరంలో ఉన్న ఈశ్వరుణ్ణి ఇవ్వు" అన్నాడు విష్ణువు. అప్పుడు గజాసురుడు అతడు మారువేషంలో వచ్చిన విష్ణువేనని గుర్తించాడు. విష్ణువనగా సర్వత్ర వ్యాపించినవాడు. కనుక ఈ రహస్యం అతనికి తప్ప మరొకరికి తెలియడానికి వీల్లేదు. వెంటనే గజాసురుడు విష్ణువుకు సాష్టాంగ నమస్కారం చేసి ఈశ్వరుణ్ణి అప్పజెప్పాడు. అయితే దానికి ముందు, తాను మరణించినా తన శిరస్సును అందరూ పూజించేటట్లు వరమడిగాడు. కనుకనే ఈశ్వరుడు ఆ గజాసురుని తలను తన కుమారుడైన గణపతికి పెట్టాడు.

భారతదేశంలో ఎక్కడే చిన్న శుభకార్యం జరిగినా మొట్టమొదట విఘ్నేశ్వరపూజ జరుగుతుంది. దీని అంతరార్థమేమిటి? గజము మృగములలో పెద్దది. నడవటానికి కూడా దారిలేని ప్రదేశంలో ఏనుగు ఒక్కపర్యాయం నడిస్తే చాలు, అక్కడ దారి ఏర్పడి పోతుంది. అందువల్లనే అందరికీ మార్గదర్శకమైనది గజము. గజతెలివి చాల గొప్పది. మరొక విశేషమేమిటంటే ఇది చాల కృతజ్ఞత కల్గిన జంతువు. ఎలాంటి పరిస్థితియందైనా తన యజమానిని మరువదు. ప్రాణం పోయే సమయంలో కూడా యజమాని కంఠము వింటే కన్నులు తెరచి చూస్తుంది. అనగా విశ్వాసం కల్గిన జంతువు ఏనుగు. ఇదే మానవునిలో ఉండవలసిన ప్రధానమైన గుణం.

*ఆరోగ్య భాగ్యాన్ని అందించే నైవేద్యం*

ఈనాడు భారతీయులు వినాయకునికి కుడుములు, ఉండ్రాళ్ళు నైవేద్యం పెడుతుంటారు. వీటిని తైల సంస్కారం లేకుండా ఆవిరితో ఉడికిస్తారు. బియ్యం పిండిలో బెల్లము, నువ్వులు కలిపి పెట్టి ఆవిరితో ఉడికించి కుడుములను తయారు చేస్తారు. ఇది అయుర్వేదంలో చాల ప్రధానమైనది. ఆవిరితో ఉడికిన కుడుములవల్ల అనేక రోగాలు నివారణ అవుతాయి. బెల్లము వాత పిత్త దోషాలను పరిహారం గావిస్తుంది, నువ్వులు రక్తాన్ని పరిశుద్ధం చేస్తాయి. అంతేకాదు, దృష్టిని అభివృద్ధి పర్చుతాయి. ఆవిరితో ఉడికిన పదార్థం ఎవరికైనా సరే, సులభంగా జీర్ణమవుతుంది. ఆసుపత్రిలో కూడా హార్ట్ ఆపరేషన్ జరిగిన పేషంట్‌కు రెండవదినమే ఇడ్లీలు పెడతారు; ఉప్మా, బోండా, పకోడాలు పెట్టరు. అనగా వినాయకునికి పెట్టే నైవేద్యం మానవునికి ఆరోగ్య భాగ్యాన్ని చేకూర్చుతుంది. ఆరోగ్యం, ఆనందం, శాంతి, జ్ఞానం మున్నగు వాటిని చేకూర్చే తత్త్వమే వినాయక తత్త్వం. దీనినెవ్వరూ పూర్తిగా అర్థం చేసుకోవడం లేదు. ఏదో ఇంత మట్టి తెచ్చి వినాయకుని

బొమ్మచేసి దానిపై పనికిరాని పుష్పములను వేసి దానిని ముంచి, తెచ్చి చాల ఘనంగా పూజ చేశామని సంతృప్తి పడుతున్నారు. ఇది కాదు మనం చేయవలసింది, మనకు ప్రీతికరమైనది మనం అర్పితం చేయాలి. ఇదే పార్వతి నందీశ్వరునికి బోధించినది. ''ఓ నందీశ్వరా! నీకు ప్రీతి కరమైన దేదో దానిని నా కుమారునికి నీవు అర్పించు. అప్పుడు తనకు ప్రీతికరమైనది తాను నీకు అందిస్తాడు'' అన్నది.

*మూషికవాహనుడనగా...*

వినాయకుడు మూషికవాహనుడు. అతని కీ పేరు ఎందుకు వచ్చింది? మూషికము చీకటికి గుర్తు. చీకటి అనగా అజ్ఞానం. చీకటిలో ప్రయాణం చేసేది మూషికము, లైటు ఉంటే అది ప్రయాణం చేయదు. కనుక మూషికవాహను డనగా అజ్ఞానమనే చీకటిని అణగద్రొక్కినవాడని అర్థము. దీనికి మరొక అర్థం కూడా ఉన్నది. మూషికమునకు వాసన చాల ప్రధాన మైనది. వాసనను బట్టి ఏ పదార్థం ఎక్కడున్నదో కను క్కోగలదు. జన్మాంతర వాసనలవల్లనే మానవుడు ఈ ప్రాకృత జీవితంలో అనేక పెడమార్గములు పడు తుంటాడు. వాసనలనగా కోరికలు. కనుక కోరికల నణగ ద్రొక్కినవాడు మూషిక వాహనుడు. చూశారా! మూషికవాహనుడనగా ఎంత పవిత్రమైన అంతరార్థాలున్నవో! వీటిని గుర్తించకుండా పెద్ద పొట్ట కల్గిన వినాయకుడు చిన్న ఎలుకపై ఎందుకు ప్రయాణిం చాలి? అని యోచిస్తారు కొందరు. మూషికము అతని వాహనం కాదు; అతడు అజ్ఞానము నణగ ద్రొక్కిన వాడు, వాంఛలనరికట్టినవాడు అని దీని అర్థం.

**వివేకానందునికి కనువిప్పు**

భగవంతుడు ఏమి చెప్పినా, ఏది చేసినా మీ కోసమేగాని తనకోసం కాదు. భగవంతునిలో ఏనాడూ స్వార్థం ఉండదు. మీ సుబుద్ధిని బట్టి భగవంతుడు ఇలాంటివాడు, అలాంటివాడు అని మీరు యోచన చేస్తారేగాని నిజంగా భగవంతుని ప్రేమ తత్త్వాన్ని ఎవ్వరూ అర్థం చేసుకోలేరు. వివేకానంద చరిత్రలో దీనికొక చిన్నకథ ఉన్నది. వివేకానందుడు తన తండ్రి మరణించగా రామకృష్ణ పరమహంసవద్ద నుండి ఇంటికి వచ్చేశాడు. ఒకనాడు సరుకులు తీసుకు రావడానికి ప్రక్క గ్రామంలోని సంతకు వెళ్ళాడు. సరుకులు తీసుకొని ఇంటికి తిరిగి వస్తుండగా వర్షవృష్టి ప్రారంభమైనది. వర్షం తగ్గే సూచనలు కని పించకపోవడంతో ఆ రాత్రికి ఉండాలనుకొని ఒక పూలమ్మేవారి ఇంటిపంచలో ప్రవేశించాడు. కొంతసే పటికి ఇద్దరు చేపలమ్ముకొనే స్త్రీలు కూడా వచ్చి ఆ వరం డాలో కూర్చున్నారు. కాని వారికి ఎంతసేపటికీ నిద్ర పట్టలేదు. అప్పుడొకామె అన్నది. ''ఏమమ్మ చెల్లెలా! ఈ చోటు పూలవాసనవల్ల నాకు నిద్రరావటం లేదు'' అన్నది. అప్పుడా చెల్లెలు, ''అక్కా! ఈ చేపలబుట్టను తలక్రింద పెట్టుకో, పూలవాసన పోతుంది, మంచి నిద్ర వస్తుంది'' అని సలహా చెప్పింది. వారిరువురి సంభా షణను వివేకానందుడు ఆసక్తిగా విన్నాడు. ''ఆహా! సుగంధము నందించే పూలకంటే దుర్గంధముతో కూడిన చేపలంటే వీరు ఇష్టపడుతున్నారు. ఎవరి సంస్కార మును బట్టి వారి భావములుంటాయి కదా!'' అని తనలో తాను అనుకున్నాడు. మరునాడు తెల్లవారు ఝామున లేచి తన గ్రామానికి ప్రయాణమయ్యాడు. దారిలో ఒక వ్యక్తి కాలువ గట్టుపై స్పృహతప్పి పడియుం డటం చూశాడు. ఇంతలో ఇద్దరు దొంగలు అదే మార్గంలో వస్తూ ఆ వ్యక్తిని చూశారు. ''వీడెవడో మనవలె రాత్రంతా దొంగతనంచేసి తప్పత్రాగి మత్తులో పడిపోయాడురా'' అని నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

ఇంకొకవ్యక్తి అటువైపుగా వచ్చి, "అయ్యో పాపం! ఇతనికి నావలె ఫిట్స్ వచ్చి పడిపోయాడేమో!" అని జాలి పడ్డాడు. కొంతసేపటికి ఒక సన్యాసి వచ్చి, "ఆహా! ఇతడెవరో మహనీయునివలె ఉన్నాడు. ఏమి ఇతని అదృష్టం! హాయిగా నిర్వికల్ప సమాధిలో ఉన్నాడు. ఇలాంటి మహనీయుని సేవ చిక్కడం నా అదృష్టం" అని అతని పాదములు పట్టుతూ కూర్చున్నాడు. ఇదంతా వివేకానందుడు దూరంగా నిలబడి గమనిస్తూ వచ్చాడు. మంచిచెడ్డలు మానవుని భావములోనే ఉన్నాయికాని, బయట లేవని గుర్తించాడు. "అయ్యో! నేనింతకాలము రామకృష్ణునిపై అనేకవిధాలుగా సందేహ పడుతూ వచ్చాను. ఇదంతా నా దోషమే; రామకృష్ణునిలో ఎట్టి దోషమూ లేదు" అని పశ్చాత్తాపపడ్డాడు. తక్షణమే ఇంటికి వెళ్ళాడు. తల్లికి నమస్కరించి, "అమ్మా! పరమపవిత్రుడైన నా గురువును నేను అనవసరంగా వదలి పెట్టి వచ్చేశాను. ఇది నా బుద్ధి దోషమేగాని మరొకటి కాదు. కనుక నా మనసెలవిస్తే నేను మళ్ళీ ఆ మహనీయుని వద్దకు పోయి సేవ చేసుకుంటాను" అన్నాడు. "నీ ఇష్ట ప్రకారమే చేయి నాయనా!" అని తల్లి అంగీకరించింది.

మానవునికి బయట కనిపించేదంతా తన అంతర్భావము యొక్క ప్రతిబింబమే. తన భావములనే భగవంతునియందు కూడా ప్రతిబింబింపజేసుకొని, భగవంతుడు కూడా తనవలె ఉన్నాడేమో అని భ్రమిస్తుంటాడు. ఇది తన దోషమేగాని భగవంతునిలో ఏమాత్రము దోషము లేదు. భగవంతుడు నిర్వికల్పుడు, నిరాకారుడు, నిర్గుణుడు. ఎట్టి ప్రమాణములకు చిక్కనివాడు కనుకనే భగవంతుణ్ణి అప్రమేయుడని కూడా అన్నారు. భగవంతుని గూర్చి ఎవరికి తోచినట్లు వారు భావించుకోవచ్చు. దానివల్ల ఆయనకు ఆదాయంగాని, నష్టంగాని ఏదీ లేదు. ఈనాడు ఎవరికి వారు తమ భావములపై ఆధారపడుతున్నారుకాని, దైవసంకల్పంపై ఆధారపడటం లేదు. ఎవరు భగవంతుని సంకల్పమును, భగవంతుని ఇష్టమును అనుసరిస్తారో వారే నిజమైన భక్తులు.

**ఇచ్చుకొనేవారికే పుచ్చుకొనే అర్హత ఉంటుంది**

ఇంతకు ముందు చిట్టిబాబు తన ప్రసంగంలో, "స్వామీ! మాకు చక్కని తెలివిని, చక్కని బుద్ధిని ఇవ్వండి" అని కోరాడు. మాకు అదివ్వండి, ఇదివ్వండి అని కోరినాడేగాని మీరు ఏమిచ్చుకుంటారనేది చెప్పలేదు. ముందు మనం భగవంతునికి ఇచ్చుకునేదాని గురించి చెప్పుకోవాలి. భగవంతుడు ఏమైనా ఇస్తాడు, ఏది కావాలన్నా ఇస్తాడు. కాని పుచ్చుకొనే అధికారం మీలో ఉండాలి కదా! బ్యాంకులో క్యాషియర్ చేతిలో బోలెడు డబ్బు ఉందికదా అని అతనివద్దకు పోయి, "అయ్యా! కొంత డబ్బు ఇవ్వండి" అంటే ఇస్తాడా? ఇవ్వడు. మీ పేరు మీద ఎంత డిపాజిట్ చేశారో దానికి మీరొక చెక్కు వ్రాసి ఇస్తే మీకు డబ్బిస్తాడు. అసలు మీరు డిపాజిట్టే చేయకపోతే మీకు డబ్బు ఎలా ఇస్తాడు?! అదేవిధంగా మీరు భగవంతునివద్ద ప్రేమను, పవిత్రతను డిపాజిట్ చేయాలి, ప్రార్థన అనే చెక్కును ఇవ్వాలి. అప్పుడే మీరు భగవంతుని నుండి పవిత్రమైన ఫలితమును అందుకోగలరు. కవరుపై స్టాంపు, అడ్రస్సు సరిగా ఉంటే అది ఎక్కడికైనా ఎంతదూరమైనా పోయి చేరుతుంది. అదేవిధంగా మీ ప్రార్థన అనే కవర్ పై విశ్వాసమనే స్టాంపు, ప్రేమ అనే అడ్రస్సు సరిగా ఉండాలి. మీ మనస్సులో ఎట్టి కల్మషమూ లేకుండా చూసుకోవాలి. ఇనుప ముక్కను మట్టిలో వేస్తే దానికి 'డస్ట్' (దుమ్ము) చేరి రస్ట్ (త్రుప్పు) పట్టుకుంటుంది. ఆ రస్ట్‌ను తొలగించాలంటే దానిని అగ్నిలో వేయాలి.

అదేవిధంగా మీ మనస్సులో తుచ్ఛమైన కోరికలనే దుమ్ము చేరటంచేత దానికి కల్మషమనే రస్టు పడుతుంది. ఈ కల్మషమనే రస్టును తీసివేయాలంటే దానిని టెస్టు (పరీక్ష) అనే అగ్నిలో వేయాలి. టెస్టు చేసినప్పుడే మీ జీవితానికి టేస్టు చేకూరుతుంది. విద్యార్థులు పై క్లాసులకు పోవాలనుకుంటే పరీక్షలన్నింటికీ సిద్ధంగా ఉండాలి. పరీక్షలో మంచిమార్కులు వచ్చినప్పుడే పై క్లాసులో చేరడానికి వీలవుతుంది. ఎంత ప్రియమైన వైస్‌చాన్స్‌లర్ అయినా విద్యార్థులకు పరీక్షలు పెట్టకుండా ప్రొమోషన్ ఇవ్వడు.

*భగవంతుడు పెట్టే పరీక్ష*

అదేవిధంగా భగవంతుడు కూడా మీకు ఉన్నత స్థాయిని అందించడానికే మీకు అప్పుడప్పుడు పరీక్ష పెడుతుంటాడు. టెస్ట్ పెట్టడమే భగవంతునికి మంచి టేస్ట్ (రుచి) గా ఉంటుంది. ఆ టెస్ట్‌లను అందుకోవడం మీకు కూడా మంచి టేస్ట్‌గా ఉండాలి. "ఓ భగవంతుడా! నీవు నాకు ఎంత త్వరగా పరీక్షలు పెడితే అంత త్వరగా నేను ఉన్నత స్థాయికి చేరుకుంటాను. కాబట్టి నాకు పరీక్షలు పెట్టు" అని ప్రార్థించాలి. కాని ఈ కలి ప్రభావము చేత మానవుడు, "ఓ భగవంతుడా! నాకు పరీక్షలు పెట్టవద్దు" అని ప్రార్థిస్తున్నాడు. పరీక్షలు లేకపోతే పై క్లాసులకు పోవడానికెలా వీలౌతుంది?! అసలు ఏమిటి భగవంతుడు పెట్టే పరీక్ష? మీకు అశాశ్వతమైన ఈ జగత్తుపై ఎంత విశ్వాసముంది? దైవంపై ఎంత విశ్వాసముంది? అనేది పరీక్షిస్తాడు. మీకు భౌతిక జగత్తుపై ఉన్న విశ్వాసంలో నూరింటి ఒక భాగమైనా భగవంతునిపై లేకపోతే మిమ్మల్ని భగవంతుడెలా అనుగ్రహిస్తాడు?!

*భగవంతుడు నమ్మకానికి తగిన ఫలితం ఇస్తాడు*

మీరు పుత్రమిత్రభరణ వ్యాపారముల నిమిత్తమై, ధనధాన్యభోగయశస్సుల నిమిత్తమై ఎంతో కాలమును వ్యర్థం చేస్తున్నారు. అందులో నూరింట ఒక భాగమైనా భగవంతుని నిమిత్తమై వినియోగిస్తున్నారా? ముందు భగవంతునిపై విశ్వాసమును అభివృద్ధి పరచుకోవాలి. తనపై తనకు అనుమానం కలవాడే భగవంతుణ్ణి అనుమానిస్తుంటాడు. కనుక ముందు మానవుడు తనను తాను నమ్మాలి; తరువాత భగవంతుణ్ణి నమ్మాలి. అలాంటి వాడే ఉన్నతస్థాయికి చేరుకోగలడు. తనను తాను నమ్మలేనివాడు దైవాన్ని ఎట్లా నమ్మగలడు? ఒకానొక సమయంలో ఒక గ్రుడ్డివాడు జీసస్‌వద్దకు వచ్చి తనకు చూపునిమ్మని అడిగాడు. "నేనివ్వగలనన్న నమ్మకం నీకున్నదా?" అని అడిగాడు జీసస్. గ్రుడ్డివాడు, "ఆ నమ్మకంచేతనే నేను వచ్చాను" అన్నాడు. అప్పుడు జీసస్ అతని కళ్ళను స్పృశించి చూపును ప్రసాదించాడు. అదే విధంగా అనేకులు నా వద్దకు వచ్చి, "స్వామి! నాకు అదిస్తావా? ఇదిస్తావా?" అని అడుగుతారు. ముందు నేనివ్వగలనన్న నమ్మకం మీలో ఉన్నదా? మీ నమ్మకమును బట్టే నేనిస్తాను.

**అల్పబుద్ధితో అధికులను అంచనా వేయకూడదు**

జీసస్ దగ్గర 'డౌటింగ్ థామస్' ఉండినట్లుగా గురువులందరి దగ్గర అనేకమంది 'డౌటింగ్ థామస్' లు ఉంటారు. ఒక పర్యాయం వివేకానందుడు రామకృష్ణునికి ధనంపై ఆశ ఉన్నదా? అని పరీక్షించడానికి అతని బెడ్ క్రింద కొన్ని నాణెములు వేశాడు. రామకృష్ణుడు వచ్చి ఆ బెడ్ పైన కూర్చోబోయి ముళ్ళు గ్రుచ్చుకున్నట్లుగా ఎగిరి పడ్డాడు. అప్పుడు వివేకానందుడు తన అల్పబుద్ధికి సిగ్గుపడ్డాడు. మీరు మహనీయులను సరిగా గుర్తించాలనుకుంటే మీరుకూడా మహనీయుల స్థాయికి పోవాలి. విమానం ఆకాశంలో సంచరిస్తుంటే భూమిపై సంచరిస్తున్న మీకు విమానం కనిపిస్తుందిగాని,

అందులోని పైలట్ ఎవరనేది మీకు తెలుస్తుందా? ఆ పైలట్‌ను చూడాలని ఆశగా ఉంటే మీరు టికెట్ కొనుక్కొని విమానంలో కూర్చోవాలి. అంతేగాని మీరు క్రింద కూర్చుని పైనున్న పైలట్ ఎవరని ఆలోచిస్తే ప్రయోజన మేమిటి?! ఈనాటి మానవులంతా క్రింది స్థాయిలో కూర్చుని ఉన్నత స్థాయిలో ఉన్న భగవంతుణ్ణి అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. ఇది చాల పొరపాటు. మొట్టమొదట మీ గురించి మీరు విచారణ చేసుకోవాలి; మిమ్మల్ని మీరు పరీక్షించుకోవాలి; మిమ్మల్ని మీరు శిక్షించుకోవాలి. ఈనాడు అందరూ పరులను శిక్షించడానికి ప్రయత్నం చేస్తుంటారుగాని, ఎవ్వరూ తమను తాము శిక్షించుకోరు.

*గణపతిపూజలో అంతరార్థం*

ఏ ఇబ్బందులూ కలుగకుండా మనం నిరంతరం సుఖసంతోషాలతో ఉండాలంటే సర్వవిఘ్నములు దూరం గావించే విఘ్నేశ్వరుని ప్రార్థించాలి. అంటే విఘ్నేశ్వరుని గుడికి పోవలెనా? కాదు, కాదు. "దేహో దేవాలయ ప్రోక్తో జీవోదేవస్సనాతనః" దేహం లోనే ఉన్నాడు వినాయకుడు. మన బుద్ధియే వినాయకుడు, మన విజ్ఞానమే వినాయకుడు, మన తెలివే వినాయకుడు. వీటిని సరియైన రీతిగా ఉపయోగ పెట్టుకున్నప్పుడు మన కోరికలు అన్నీ నెరవేరుతాయి. పంచేంద్రియాలకు అధిపతి గణపతి. కనుక ఏనాడు నీవు నీ పంచేంద్రియాలను వశం చేసుకుంటావో ఆనాడు నీవే గణపతివి. పది దినములు గణపతిని పెట్టుకొని పూజించడంలో అంతరార్థ మేమిటి? ఒక్కొక్క దినము ఒక్కొక్క ఇంద్రియమును అరికట్టుకోవాలి.

విద్యార్థులారా! ఇంద్రియనిగ్రహం చాల సులభమైనది. కాని మీకు తెలియకపోవడంచేత మీరు చాల అవస్థ పడిపోతున్నారు. మొట్టమొదట ఇంద్రియనిగ్రహానికి అనుకూలమైన వాతావరణాన్ని మీరు ఏర్పర్చుకోవాలి. ఎట్లా? మీ ద్వేషి ఒకడు మీ కెదురుగా వచ్చాడనుకోండి. అప్పుడు మీరు కూడా వానిని ద్వేషిస్తే ఇంత పెద్ద యుద్ధం ప్రారంభమౌతుంది. అట్లుగాకుండా, "హలో బ్రదర్! ఎలా ఉన్నావు?" అని పలకరించి చూడండి; తప్పక వాని ద్వేషం తగ్గిపోతుంది. ఒకానొక సమయంలో బుద్ధుని చంపడానికి ఒక రాక్షసుడు కత్తి పట్టుకొని వచ్చాడు. అతడిని చూసి బుద్ధుడు చిరునవ్వుతో, "సోదరా! నన్ను చంపాలనుకుంటున్నావా? నేను సిద్ధమే" అని తల వంచాడు. ఆ రాక్షసునికి ఆశ్చర్యం కలిగింది. తక్షణమే కత్తిని క్రింద పారవేసి బుద్ధుని పాదాలపై పడ్డాడు. కనుక మనం ఎవ్వరినీ ద్వేషించకూడదు. అందరితోను స్నేహంగా మెలగాలి. ఎవరో ఏదో తప్పు చేశాడని వానిని శిక్షించడానికి ప్రయత్నించకూడదు; వానిని సరి చేయుటకు తగిన మార్గమును వెతకాలి. అప్పుడు వానిలో తప్పక పరివర్తన కలుగుతుంది.

విద్యార్థులారా! వినాయకచవితి జరుపుకోవడ మంటే ఏవో బాహ్యమైన పూజలు చేయడం కాదు. అవి కూడా మనకు అవసరమే. కాని, అంతర్భావము లేని ఆచరణవల్ల ప్రయోజనం లేదు. మీలోనే దైవత్వం నిండి నిబిడీకృతమైయున్నదనే సత్యాన్ని గుర్తించి వర్తించండి. మీ బుద్ధియే గణపతి స్వరూపం. దానిని మీరు సద్వినియోగం చేసుకోండి. దాని నిమిత్తమై భగవంతునికి ప్రీతికరమైన పనులు చేస్తూరండి. భగవంతునికి ఏది ప్రీతికరమైనది? మితభాష ప్రీతికరమైనది; ద్వేషము, అసూయవంటి దుర్భావములు ప్రీతికరమైనవి కావు. కనుక ముందు వాటిని అణగద్రొక్కండి.

(తేది : **6.9.97** సాయంత్రం సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

# వైభవోపేతంగా స్వర్ణరథ సాయిపాదుకా మహోత్సవాలు

శిరమున పాదుకల్ తనర, చిత్తము నామజపంబు సేయగా
తరలిరి సత్యసాయి అవతారుని కొల్వగ పర్తిలోనః సుం
దర దరహాస వీచికలు తాండవమాడగ పర్తిస్వామి తా
కరముల నెత్తి దీవనలు కాంక్షలు తీరగ చేసె భక్తులన్.

శ్రీవారి చిరకాల భక్తులైన శ్రీ పి. సుబ్రహ్మణ్య చెట్టియార్ నేతృత్వంలో మధురైకి చెందిన సాయిపాదుకా ట్రస్టు యొక్క ఐదవవార్షికోత్సవం సెప్టెంబర్ 20వ తేది నుండి 24వ తేది వరకు ప్రశాంతి నిలయంలో వైభవోపేతంగా జరిగింది. ఈ ట్రస్టు గత ఐదేళ్ళుగా క్రమం తప్పక ప్రతి సంవత్సరం ప్రశాంతి నిలయంలో పెద్ద ఎత్తున పాదుకా మహోత్సవాలను నిర్వహిస్తున్న సంగతి లోకవిదితమే. ఈ ఏడాది ఉత్సవాలలో భాగంగా శ్రీవారికి తొలిసారిగా రథోత్సవం నిర్వహించ తలపెట్టి రత్నకు మిరుమిట్లు గొల్పే బంగారు రథాన్ని తయారు చేయించి తెసుకు వచ్చారు. ''నభూతో నభవిష్యతి' అన్నరీతిలో జరిగిన స్వర్ణరథోత్సవంతోపాటు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి పాల రాతి విగ్రహప్రతిష్ఠ, శక్తివేల్ పాదుకల సమర్పణ, 2016 జతల పాదుకలకు అభిషేకాలు - ఐదు రోజుల పాటు జరి గిన ఈ ఉత్సవాలలో ప్రధానాంశాలుగా చోటుచేసుకు న్నాయి. ఈ సందర్భంగా ప్రశాంతి నిలయంలో పలుచో ట్ల శ్రీవారి దివ్యసూక్తులతో కూడిన స్వాగతద్వారాలు నెలకొన్నాయి. రౌండ్ బిల్డింగ్‌లపై విద్యుద్దీపాలతో అల ంకరింపబడిన శివపార్వతులు, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కటౌట్‌లు ఏర్పాటు చేయ బడ్డాయి.

20వ తేది ఉదయం 5 గంటలకు 27వ నెంబర్ హాల్‌లో సుప్రభాతం, విఘ్నేశ్వర పూజ, నవగ్రహ హోమాలతో కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. సుబ్రహ్మణ్యస్వామి విగ్రహానికి, స్వర్ణరథానికి ప్రత్యేక పూజలు జరిగాయి. సాయంత్రం పూర్ణాహుతి నిర్వహింపబడింది.

## సుబ్రహ్మణ్యేశ్వర విగ్రహ ప్రతిష్ఠ

మరునాడు ఉదయం 5 గంటల నుండి 7.30 వరకు మూలమంత్ర సంపుటీకరణ హోమం, రక్షిఘ్న దేవతా హోమం నిర్వహింపబడ్డాయి. అనంతరం సుబ్రహ్మణ్యస్వామి విగ్రహ ఊరేగింపు జరిగింది. వేద మంత్రాలు, మంగళవా[illegible] సరిగ్గా 9 గం॥కు ప్రశాంతి నిలయ ప్రధాన ప్రవేశ ద్వారానికి ఎదురుగావున్న విఘ్నేశ్వరాలయానికి ఎడమవైపు మార్గంలో నూతనంగా నెలకొన్న అందమైన గుడిలో శ్రీవారిచే సుబ్రహ్మణ్యస్వామి విగ్రహ ప్రతిష్ఠ గావింపబడింది.

అదే రోజు సాయంత్రం 6 గంటలకు సాయి కుల్వంత్ సభామండపంలో శ్రీ కదిరి గోపాల్‌నాథ్ సాక్సాఫోన్ (Saxophone) వాద్య కచేరి నిర్వహించారు. అనంతరం మధురైకి చెందిన శ్రీ ఆర్. సురేష్ మనోహరమైన జానపద నృత్య ప్రదర్శనతో అలరించారు. అతని ప్రతిభను మెచ్చి శ్రీవారు ఒక సువర్ణహారాన్ని సృష్టించి బహూకరించారు.

## స్వర్ణాదిత్య పాదుకా రథోత్సవం

అరయని స్వర్ణమయమగు రథమున శ్రీ [illegible] సుం
దరమై ధాత్రికి [illegible]
దర భాగంబున పార్వతీపతులు [illegible] శ్రీ
కర సంపత్తిగ బ్రహ్మోత్సవము [illegible]
[illegible] సాఫల్యము చేయుచున్న [illegible]! శ్రీసాయి [illegible]

ప్రశాంతి నిలయంలో భక్తులందరూ వేయి కన్నులతో ఎదురు చూసిన శుభదినం, సెప్టెంబర్ 22వ తేది, రానే వచ్చింది. అది సాయిపాదుకాట్రస్టు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడిన రోజు. నటరాజ విగ్రహాలంకృత పూర్ణచంద్ర సభామంటప ముఖద్వారము నుండి ఉదయం 7 గంటలకు రథోత్సవం ప్రారంభం కావలసి యుండగా తెల్లవారు ఝామున 3 గంటలకే నేల ఈనినట్లుగా జనం ప్రోగై రథం పయనించే మార్గానికి ఇరువైపుల బారులు తీరారు. సూర్యరథాన్ని తలపించే ఆ స్వర్ణరథంపై దీపకాంతి ఉట్టిపడుతున్న శివపార్వతులు, లక్ష్మీనారాయణులు, చతుర్ముఖ బ్రహ్మ విగ్రహాలను తిలకిస్తే - శ్రీమహావిష్ణుస్వరూపమైన సాయిభగవానుని స్వర్ణ రథోత్సవంలో పాల్గొనాలనే ఉత్సాహంతో సాక్షాత్తు ఆ దేవతామూర్తులే దివి నుండి భువికి దిగి వచ్చారా, అనిపించింది.

*కనక రథంబు లోపల కన్పడువాడని కోరెనేమొ? లా*
*జనకుని ముద్దులోడ విను సంతసమై నడిపింపవచ్చె; ఈ*
*వినయ వివేకతా గరిమ వేల్పు జనించును చూపినంత; మున్*
*కని విని యుండలేదిట్టిది కన్పడుచుండు రథంబు లోపలన్*

సరిగ్గా 7 గం॥ 5 ని॥ లకు శ్రీవారు స్వర్ణరథంపై రత్నఖచిత సింహాసనాన్ని అలంకరించగా భక్తుల ఆనందం కట్టలు తెంచుకొంది; మంగళవాయిద్యాలు మారుమ్రోగాయి; జయజయ ధ్వానాలు మిన్నుముట్టాయి. చతుర్ముఖ బ్రహ్మ సప్తాశ్వముల పగ్గాలను చేతబూనాడు; శివపార్వతులు సింహాసనం ఎదురుగా కొలువుదీరారు; సూర్యభగవానుడు వెనుక నిలచి గొడుగు పట్టాడు. అందుచే కాబోలు, రథోత్సవం జరిగినంతసేపు ఆకాశంలో దినకరుని జాడ లేదు! రథం బయలుదేరే ముందుగా శ్రీ సుబ్రహ్మణ్య చెట్టియార్ శ్రీవారి దివ్యహస్తాలకు సువర్ణ వేలాయుధాన్ని అందించగా భక్తులు మహోత్సాహంతో పెద్దపెట్టున జయజయ ధ్వానాలు చేశారు. పండితులు వేదమంత్రోచ్చారణ సల్పారు. విద్యార్థులు నెమ్మదిగా త్రాళ్లను లాగుతూ రథాన్ని ముందుకు నడిపించారు. స్వర్ణరథంపై కోటి సూర్యుల మేటి కాంతితో వెలుగొందిన సాయిభగవానుని దర్శించి భక్తులు పరవశించారు. భక్తకోటి హృదయాలను ఆనందడోలికల్లో ఉయ్యాలలూగిస్తూ వెస్ట్-వన్ బ్లాక్ ముందు నుండి క్యాంటీన్ రోడ్డు మీదుగా రథం కదిలింది. దారి పొడుగునా బారులు తీరిన అశేష ప్రజానీకాన్ని ఆశీర్వదిస్తూ శ్రీవారు 7.30ని.లకు సాయి కుల్వంత్ హాల్‌లోనికి ప్రవేశించారు. అక్కడ కూడా క్రిక్కిరిసి పోయిన అసంఖ్యాకులు పట్టలేని ఆనందంతో పెద్ద పెట్టున కరతాళధ్వనులు చేశారు. శ్రీవారు కొద్దిసేపు రథంపైనే నిలబడి భక్తులను ఆశీర్వదించి ఆనందపరవశులను గావించారు. భజన తరువాత మంగళహారతితో కార్యక్రమం ముగిసింది.

**శ్రీ శ్రీనివాసన్ ప్రసంగం :**

సాయంత్రం 4 గంటలకు జరిగిన సమావేశములో శ్రీ సుబ్రహ్మణ్య చెట్టియార్ కుమారుడైన శ్రీ శ్రీనివాసన్ ప్రారంభోపన్యాసం చేస్తూ సాయిపాదుకా ట్రస్ట్ ఆవిర్భావం గురించి, స్వర్ణరథప్రాశస్త్యం గురించి ఈ విధంగా అన్నారు.

''మా తండ్రిగారు సుమారు యాభైఐదు సంవత్సరాల క్రిందటే భగవాన్ బాబావారిని పూర్ణావతారులుగా గుర్తించి పుట్టపర్తికి తరచుగా రాకపోకలు సాగిస్తూ వచ్చారు. 1990వ సం॥లో మా తండ్రిగారి 81వ పుట్టిన రోజు సందర్భంగా శ్రీవారు ఒక జత వెండి పాదుకలను తమ దివ్యపాదస్పర్శతో పునీతం గావించి అనుగ్రహించారు. వాటిని మా ఇంట్లో ప్రతిష్ఠించుకొని పూజించడం ప్రారంభించిన తరువాత మేము పొందిన దివ్య

అనుభూతులను మాటల్లో వర్ణించలేను. మాతోటి భక్తులుకూడా మావలె సాయిపాదుకలను పూజించి సాయి అనుగ్రహానికి పాత్రులు కావాలనే సత్సంకల్పంతో మా తండ్రిగారు భగవాన్ బాబావారి అనుమతిని, ఆశీస్సులను పొంది సాయిపాదుకాప్రతిష్ఠా మహోద్యమాన్ని ప్రారంభించారు. 1993 లో తొలిసారిగా జరిగిన పాదుకామహోత్సవంలో 108 దంపతులు పాల్గొన్నారు. గడచిన నాల్గు సంవత్సరాలలో ఈ ఉద్యమం ప్రపంచవ్యాప్తమై నేటికి పాదుకలు స్వీకరించిన దంపతుల సంఖ్య 2116 కు పెరిగింది. ఇందులో 37 దేశాలకు చెందిన వారున్నారు. ఈవిధంగా సాయిపాదుకలకు నానాటికీ డిమాండ్ పెరుగుతున్నదంటే అందుకు తగిన కారణం లేకపోలేదు. సాయిపాదుకలను భక్తి శ్రద్ధలతో పూజించడంవల్ల మొండివ్యాధులు నయమౌతున్నాయి, వివాహ ప్రయత్నాలు ఫలిస్తున్నాయి, మనశ్శాంతి చేకూరుతున్నది. ఎక్కడ సాయిపాదుకలుంటాయో అక్కడ భగవంతుడుంటాడని శ్రీవారు క్రిందటి పాదుకామహోత్సవంలో అన్నమాట మీకు గుర్తుండే ఉంటుంది. పాదుకల ఔన్నత్యానికి ఇంతకు మించి ఋజువేమి కావాలి?!

శ్రీవారి దివ్యాశీస్సులతో - సాయిపాదుకాట్రస్టు పాదుకాపూజలను ప్రోత్సహించడంతోపాటు నామస్మరణ విశిష్టతను ప్రచారం చేయడంలోను ప్రముఖ పాత్ర వహిస్తున్నది. పాదుకాట్రస్టు 1994వ సం॥లో 108 కోట్ల సాయినామ లిఖిత జప పుస్తకాలను సమర్పించగా శ్రీవారు వాటిని సాయికుల్వంత్ ఎదురుగా గల ప్రత్యేకమైన కట్టడంల్లో నిక్షిప్తం చేయించి, ఆ పవిత్ర నిధిని కాపాడటానికా అన్నట్లు, దానిపై ఆంజనేయ పాలరాతి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. అదేవిధంగా క్రిందటి సంవత్సరం పాదుకాట్రస్టు సమర్పించిన ధన్వంతరీ విగ్రహాన్ని సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌లో ప్రతిష్ఠించారు. నిన్నటి దినమున ఎంతో వైభవంతో సుబ్రహ్మణ్యేశ్వర స్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠించి, ఈ రోజు రథోత్సవసేవకు అనుమతించి సాయిపాదుకా ట్రస్టుపై వరలేని ప్రేమను కురిపించారు. అయితే ఈ రెండింటికి సంబంధించిన వివరాలన్నీ అతిపురాతనమైన శుకనాడి అనే పత్ర గ్రంథంలో స్పష్టంగా లిఖించబడి యున్నాయి. నిన్న జరిగిన సుబ్రహ్మణ్యస్వామి విగ్రహ ప్రతిష్ఠను, నేడు జరిగిన స్వర్ణరథోత్సవాన్ని సంబంధించిన అనేక ఆసక్తికరమైన అంశాలను సుమారు 5000 సంవత్సరాలకు పూర్వమే శుకమహర్షి నాడీ గ్రంథంలో ఈ విధంగా ప్రస్తావించారు.

సుబ్రహ్మణ్యస్వామి విగ్రహ ప్రతిష్ఠకు సుముహూర్తం: భాద్రపదమాసం, కృష్ణపంచమి, భానువారం, కృత్తికా నక్షత్రం, తేది : 21.9.1997. భగవాన్ బాబావారు పెట్టిన ముహూర్తం కూడా ఇదే! ఈ విగ్రహ ప్రతిష్ఠ జరిగే ప్రదేశం చాల పవిత్రమైనది. అది పూర్వం ఒక ఋషికులం, అనేక మంది ఋషులు యజ్ఞయాగాది క్రతువుల నాచరించిన పవిత్రస్థలం. విగ్రహ ప్రతిష్ఠ జరిగిన తరువాత రోజు రథోత్సవ సేవ నిర్వహింపబడుతుంది. ఆ రోజున భగవాన్ బాబావారు సుబ్రహ్మణ్యావతారంగా వెలుగొందుతారు. ఈ ఉత్సవం చూసిన వారికి విలంబి దోష పరిహారం, సంతానానుగ్రహ ప్రాప్తి కల్గుతాయి. వారికి పునర్జన్మ ఉండదు. కలియుగంలోని రుగ్మతలన్నీ తొలగి ప్రపంచం సర్వతోముఖాభివృద్ధి నొందుతుంది.

ఈ రోజు ఉదయం భగవాన్ బాబావారు స్వర్ణ రథాన్ని అధిరోహించిన శుభముహూర్తం కూడా శుక నాడిలో లిఖించబడియున్నది'' అని పలుకుతూ శ్రీ శ్రీనివాసన్ తమ ప్రసంగాన్ని ముగించారు.

భగవాన్ బాబావారు తమ దివ్యోపన్యాసంలో - ప్రేమస్వరూపుడైన భగవంతునికి అర్పించవలసింది

ప్రేమ తప్ప మరొకటి రాదనీ, కనుక ఇక మీదట భక్తు లెవ్వరూ స్వర్ణకథాలను, బంగారు సింహాసనాలను తీసుకు రాకూడదని అన్నారు. వీటికయ్యే ఖర్చుతో సమాజాని కుపకరించే పనులు చేయాలని ఉద్బోధిం చారు. అనంతరం కుమారి కన్యాకుమారిబృందంచే వయొలిన్ వాద్య కచ్చేరి నిర్వహింపబడింది.

సాయిపాదుకా పూజ

23వ తేదీన 36 దేశాలకు చెందిన 2016 దంపతులు సాయి పాదుకలతో, పూజా ద్రవ్యములతో ఉదయం 6 గం.లకు సాయికుల్వంత్ సభామండపానికి విచ్చేసి నిర్ణీత స్థానాల్లో కూర్చున్నారు. మధురై నుండి వచ్చిన పండితులు మైకులలో వేదమంత్రాలను చదువుతూ ఇంగ్లీషు, హిందీ, తమిళ భాషలలో మంత్రార్థాలను, పూజా విధానాన్ని వివరిస్తూ దంపతులచేత లక్ష్మీ కుబేర త్రిశతి పూజ, పాదుకలకు పంచామృతాభిషేకం చేయించారు. చివరిగా దంపతులందరూ తాము కూర్చున్న చోట్ల నుండి ఏకకాలంలో శ్రీవారికి మంగళహారతులివ్వగా దట్టమైన పొగతో నిండిన సాయికుల్వంత్ హాల్‌లో ఆ వేలాది కర్పూర దీపాలు ఆకాశంలో మిలమిల మెరిసే నక్షత్రాలుగా శోభిల్లాయి; వాటి నడుమ సాయిభగవా నుడు చుక్కల్లో చంద్రుడనిగా వెలుగొందారు.

పూజలు చేసినారు పరిపూత మనోహర సాయిపాదుకల్
భ్రాజితమైన భక్తి పలుభంగుల భక్తులు చూపినారు; ఉ
త్తేజిత దేవదేవుడిక దీవనలిచ్చెను ప్రేమతోడ; నీ
రాజన మెత్తినారు అనురాగ సుధామయ ధూపదీపముల్.

సాయంత్రం జరిగిన సమావేశంలో సాయి పాదుకా ట్రస్టు సభ్యులైన డా॥ గాడియా (యు.కె) ప్రసంగిస్తూ - 1998లో ఇంగ్లాండులో జరుపతలపెట్టిన పాదుకా మహోత్సవానికి విచ్చేయవలసిందిగా శ్రీవారి ని పదేపదే ప్రార్థించారు. అనంతరం శ్రీవారు తమ దివ్యోపన్యాసంలో పాదుకా ట్రస్టు చేస్తున్న సేవలను వేనోళ్ళకొనియాడారు.

**24**వ తేది ఉదయం **7.30** ని.లకు **2016** జతల సాయిపాదుకలను శిరస్సులపై దాల్చి సాయినామాన్ని జపిస్తూ దంపతులందరూ ఊరేగింపుగా సాయి కుల్వంత్ హాల్‌కు వచ్చారు. ఈ సందర్భంగా పాదుకా ట్రస్ట్ అధ్యక్షులైన శ్రీసుబ్రహ్మణ్య చెట్టియార్ స్వర్ణాదిత్య పాదుకా రథాన్ని, శక్తివేల్ పాదుకలను శ్రీవారికి సమ ర్పించడం జరిగింది. 'సనాతన సారథి' ఎడిటర్ శ్రీ వి.కె. నరసింహన్ తమ ప్రసంగంలో పాదుకా ఉద్యమ వ్యాప్తికి శ్రీసుబ్రహ్మణ్యచెట్టియార్ మరియు ఆయన కుటుంబ సభ్యులు చేస్తున్న అవిరళ కృషిని శ్లాఘించారు. శ్రీ శ్రీనివాసన్ సాయి పాదుకా ట్రస్ట్ సభ్యులందరి తర పున శ్రీవారికి కృతజ్ఞలు తెల్పుకోవడంతో సభ ముగి సింది.

ఎచ్చట సత్యసాయి పరమేశుని నామజపంబు సాగునో
ఎచ్చట సాయి పాదుకల నెంతగ భక్తిగ పూజచేతురో
ఎచ్చట సాయినామమును ఎంతగ శ్రద్ధగ వ్రాయుచుందురో
అచ్చట శ్రీ, విభూతి,విజయప్రభలున్, స్థిరనీతిధర్మముల్
హెచ్చుగ నుండునంచు మది నెంచుడు మా భగవాను సత్యమున్.

*****

మనస్సు ఒక మదగజము వంటిది. మావటి వాని చేతిలో అంకుశము లేకపోతే మదగజము వానిని అనేక అవస్థలకు గురి చేస్తుంది. కనుక మన మనస్సనే మదగజమును లొంగదీసుకోవా లంటే మాధవనామమనే అంకుశము నుపయోగించాలి; త్రికరణశుద్ధిగా నామస్మరణ చేయాలి.

# భగవంతుడు భావప్రియుడేకాని బాహ్యప్రియుడు కాదు

భక్తియే పరమార్థమునకు రాజమార్గం. భగవన్నామమే జననమరణాది వ్యాధులను నివారణగావించే దివ్యౌషధం. యంత్రతంత్రములుగాని, అస్త్రశస్త్రములుగాని, రాజకీయముగాని దేశాన్ని రక్షించలేవు. భగవద్విశ్వాసం, త్యాగం, ఆధ్యాత్మిక దృక్పథం - ఇవే దేశాన్ని సంరక్షించగలవు. కనుక దేశానికి శాంతిభద్రతలు చేకూర్చవలెనన్న స్త్రీ పురుషులు ఈ మూడింటినీ అలవర్చుకోవాలి. ప్రాచీన కాలము నుండి భారతదేశం అన్ని దేశములకూ ఇట్టి పవిత్రమైన ఆధ్యాత్మిక ప్రబోధలు సల్పుతూ వస్తున్నది. సర్వ మానవ సౌభ్రాతృత్వాన్ని అభివృద్ధి పరచి, సమన్వయం సాధించి, సమత్వాన్ని ప్రకటింపజేసి, ఆనందాన్ని అందించునదే భారతీయ సంస్కృతి. కాని ఈనాడు అనేకమంది ఈ సంస్కృతి యొక్క సత్యస్వరూపాన్ని మరుగు పర్చడానికి ప్రయత్నిస్తున్నారు; ఇట్టి పవిత్రమైన సంస్కృతిని అనుసరించక అశాంతికి గురియై అనేక కష్టముల ననుభవిస్తున్నారు. ఈనాటి మానవునికి దేహాభిమానం పెరిగినది, దేశాభిమానం తరిగినది; స్వతంత్రము పెరిగినది, పర తంత్రము తరిగినది. భగవద్విశ్వాసాన్ని కోల్పోవడంచేత మానవునియందు మానవతా విలువలు క్షీణించిపోయాయి; దైవప్రీతి, పాపభీతి సన్నగిల్లాయి; త్యాగభావమే శూన్యమైనది. త్యాగభావంతో కూడిన రాజనీతి, ప్రేమభావంతో కూడిన దైవప్రీతి మానవునికి అత్యావసరం.

భగవంతుడు ఏ సమయంలో ఏ కారణంచేత ఏ కర్మను ఆచరించునో ఎవ్వరికీ తెలియదు. భగవంతుని కాలకర్మకారణకర్తవ్యాలన్నీ ప్రబోధాత్మకమైనవే! ప్రబోధనగా ఉపన్యాసం చేయడం మాత్రమే కాదు, తాను ఏది చెప్పినా అది ప్రబోధమే. అంతేకాదు, భగవంతుడు తాను పెట్టే పరీక్షలలో ఏర్పడే ఇబ్బందులను బాహ్యముగా చూపడు; కఠినమైన పరీక్షలు పెడతాడు. "ఏటిక ఎడిగి చెఱకు పెట్టినా బెల్లము ఇచ్చు గొప్ప [illegible]" మన దేహమే చెఱకువంటిది. దీనిని అనేక రకాలుగా బాధించి శోధించినప్పుడే దీనినుండి దైవత్వమనే మాధుర్యం ప్రాప్తిస్తుంది. కాని అనేకమంది ఈ సత్యాన్ని గుర్తించుకోలేక, "భగవంతుడు నన్నెందుకిలా పరీక్షిస్తున్నాడు?" అని బాధపడుతుంటారు.

## కర్ణుని త్యాగనిరతి

మహాభారతయుద్ధంలో 14వ దినమున కర్ణుడు నేలకూలాడు. పాండవులు ఆనందముతో ఉప్పొంగిపోతున్నారు. కృష్ణుడు మాత్రం చాల విచారంగా కూర్చొనియుండటం గమనించి అర్జునుడు, "బావా! ఎంతో ఆనందంగా ఉండవలసిన సమయంలో చాలవిచారంగా కనిపిస్తున్నావేమిటి?" అని అడిగాడు. కృష్ణుడు, "అర్జునా! కర్ణుని మించిన త్యాగశీలి మరొకడు లేడు. అలాంటి మహాపురుషుణ్ణి, త్యాగశీలిని దేశమీనాడు కోల్పోతున్నది కదా అని విచారిస్తున్నాను" అన్నాడు. అర్జునునికి కొంతసందేహం కల్గింది. "అతడిని మించిన త్యాగశీలి మరొకడు లేడా ఈ దేశంలో?" అని ప్రశ్నించాడు. కృష్ణుడు, "నా దృష్టిలో మాత్రం కర్ణుని మించిన త్యాగశీలి లేడు. దీనికి ఋజువు కావాలంటే నా వెంట రా" అన్నాడు.

కృష్ణార్జునులు బ్రాహ్మణవేషాలను ధరించి చిమ్మచీకటి క్రమ్ముకొన్న ఆ యుద్ధభూమిలో, "కర్ణా! కర్ణా!" అని పిలుస్తూ వెదకుతున్నారు. ఇంక కొన్ని నిమిషాలలో ప్రాణం విడువనున్న కర్ణుడు, "ఎవరు వారు?

ఎవరు వారు? నేనెక్కడున్నాను'' అని జవాబిచ్చాడు. ఆ శబ్దాన్ని ఆధారంగా చేసుకొని కృష్ణార్జునులు కర్ణుని వద్దకు వెళ్ళారు. ''ఎవరు స్వామీ మీరు? దేని నిమిత్తమై వచ్చారు? '' అని అడిగాడు కర్ణుడు. కృష్ణుడు నటన సూత్రధారి. ''కర్ణా! నేనొక బ్రాహ్మణుడను. నా కుమారునికి వివాహం తలపెట్టాను. దాని నిమిత్తమై నాకు కొంత బంగారం కావలసి వచ్చింది. నిన్ను తప్ప వేరొకరిని ఆశ్రయించనని నాలో నేను ప్రతిజ్ఞ చేసుకున్నాను. నీవు యుద్ధభూమిలో ఉన్నావని తెలిసి ఇక్కడికి వచ్చాను'' అన్నాడు. అప్పుడు కర్ణుడు ''స్వామీ! కించిత్ బంగారం కోసం ఈ చిమ్మచీకటిలో యుద్ధభూమికి రావాలా?! నా ఇంటికి వెళ్ళండి. నా భార్య కావలసినంత బంగారం ఇస్తుంది'' అన్నాడు. అప్పుడు కృష్ణుడు చెబుతున్నాడు : ''కర్ణా! నాకు కావలసింది చిన్న మంగళసూత్రానికి సరిపడే కించిత్ బంగారము. దానికోసం నేను హస్తినాపురానికి పోయి, నీ ఇల్లు వెతుక్కొని, నీ భార్యను అడుక్కొని ఇన్ని అవస్థలు పడట మెందుకు?! నాచేత కాదని చెప్పు, వెళ్ళిపోతాను''. ''అట్లయితే నా పళ్ళకున్న బంగారు తొడుగును తీసుకుపొండి స్వామీ!'' అన్నాడు కర్ణుడు. ''అయ్యో! నేను దానంకోసం వచ్చి నీ పళ్ళను విరగగొట్టి తీసుకుపోతానా?! నేనొప్పుకోను'' అన్నాడు కృష్ణుడు. అప్పుడు కర్ణుడు ప్రక్కనే ఉన్న ఒకరాతిని తీసుకొని తన పళ్ళను తానే విరగగొట్టుకున్నాడు. వాటిని చేతులతో తీసుకొని కృష్ణుని కివ్వబోయాడు. వెంటనే కృష్ణుడు, ''ఛీ, ఛీ, రక్తంలో తడిసిన పళ్ళను నేను మంగళసూత్రం కోసం ఎలా తీసుకు పోగలను? నాకక్కరలేదు'' అన్నాడు. ఆ సమయంలో కర్ణుడు కృష్ణుణ్ణి మనస్సులో స్మరించుకొని అతికష్టంమీద తన దగ్గరున్న విల్లును ఎక్కుపెట్టి మేఘంవైపు బాణం వదిలాడు. అక్కడి నుండి నీరు కారింది, దానితో ఆ పళ్ళను కడిగి, ''ఇదిగో స్వామీ! తీసుకోండి'' అన్నాడు. కృష్ణుడు అర్జునుణ్ణి చూసి చిరునవ్వులు చిందిస్తూ, ''అర్జునా! ఇంతటి త్యాగం నీలో ఉన్నదా?'' అన్నాడు. అర్జునుడు సిగ్గుతో తల వంచుకున్నాడు. అప్పుడు కృష్ణుడు కర్ణునికి తన నిజ రూపం చూపించి, ''కర్ణా! నీ భక్తి ప్రపత్తులకు, త్యాగశీలతకు మెచ్చాను. ఏమి కావాలో కోరుకో'' అన్నాడు. కృష్ణుని సుందరరూపాన్ని తనివితీరా దర్శిస్తూ కర్ణుడు, ''కృష్ణా! నా అంత్య సమయంలో నీ దివ్య దర్శనానికి మించి నాకు కావలసింది ఏముంటుంది?! నిన్ను చూస్తూ కన్ను మూయడం నా అదృష్టం. నాకింక మరొక కోరిక లేదు'' అన్నాడు.

*భగవంతుడు భావప్రియుడు*

దైవము త్యాగానికి తప్ప మరొక దానికి చిక్కడు. త్యాగం లేని భక్తిప్రపత్తులు కృత్రిమమైనవి; ఏ చిన్నది చేసినా హృదయపూర్వకంగా త్యాగం చేయాలి. భగవంతుడు ఏమి చేశావు? ఎంత చేశావు? అని ప్రశ్నించడు. ఏ భావంతో చేశావనేది మాత్రమే చూస్తాడు. భగవంతుడు భావప్రియుడేగాని బాహ్యప్రియుడు కాడు. ఈ లౌకికమైన, ప్రాకృతమైన కర్మలచేత భగవంతుడు అంత సులభంగా చిక్కడు. నిర్మలమైన హృదయంతో, పవిత్రమైన కర్మల నాచరించినప్పుడే దివ్యత్వం ప్రాప్తిస్తుంది. ఈనాటి మానవునిలో త్యాగము, కృతజ్ఞత రెండూ శూన్యమై పోయాయి. కృతజ్ఞత లోపించడమేగాక అసూయాభావం మరింత అభివృద్ధి అవుతున్నది. ప్రతి మానవునియందు అంతో, ఇంతో అసూయ ఉన్నది. అసూయ లేనిది ఎవరంటే ఒక్క అనసూయ మాత్రమే. అందువల్లనే ఆమెగర్భంలో త్రిమూర్తులు పుట్టారు. ఎవరైనా మంచి అభివృద్ధికి వస్తే వారిని చూసి ఆనందించాలేగాని అసూయతో వారికి అపకారం చేయకూడదు, వారి చెడును కోరకూడదు. కాని ఇలాంటి విశాలహృదయులు ఎక్కడా కనిపించడం లేదు. పూజలు చేస్తున్నారు, అనేక మంత్రాలనుచ్చరిస్తున్నారు. కాని ఏరకంగా చేస్తున్నారు? చిత్తశుద్ధితో చేస్తు

న్నారా? ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. హృదయ పూర్వకంగా చేస్తే భగవంతుడు మన కెంతైనా ఆనందా న్నిస్తాడు.

### పత్రం, పుష్పం, ఫలం, తోయం...

కృత్రిమ భావంచేత సత్యభామ తనవద్దనున్న ధనంతో కృష్ణుణ్ణి తనవాడుగా చేసుకోవాలని ప్రయత్నిం చింది. భగవంతుడు ధనానికి తూగడు, పదవులకు తూగడు, చదువులకు తూగడు, మేధాశక్తికి తూగడు; ఒక్క భక్తికి మాత్రమే తూగుతాడు. అందుకోసమే రుక్మిణి వచ్చి, “పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో భక్తి కలిగినవానికి వశుడవగుదు సత్యమేని కృష్ణా! నీవీ తులసీదళమునకు తూగుదువు గాక!” అని ప్రార్థించి తులసీదళం వేసేసరికి కృష్ణుడు తూగాడు. ఇక్కడ పత్రమనగా బిల్వపత్రమో, మారేడు పత్రమో కాదు; దేహమే పత్రము. పుష్పమనగా మల్లెపుష్పమో, జాజిపుష్పమో కాదు; మనస్సే పుష్పము. హృదయమే ఫలము. ఆనంద బాష్పములే తోయము. ఆనంద బాష్పములతో భగవంతునికి అభ్యార్పణ చేయాలి. ఇలాంటి వాటినే భగవంతుడు కోరుతున్నాడు. కాని మీరు వీటిని విస్మరించి బాహ్యమైన భ్రమలకు లోనై జీవి తాన్ని గడుపుతున్నారు.

### మీ హృదయమే నా మందిరం

మీరు నివసించడానికి పెద్ద పెద్ద భవనాలను నిర్మించు కుంటున్నారు. అందులో మీ బెడ్‌రూమ్, మీ డ్రాయింగ్ రూమ్, మీ డైనింగ్ రూమ్ మొదలైనవన్నీ చాల పెద్దవిగా పెట్టుకుంటున్నారుకాని భగవంతునికి మాత్రం ఏదో ఒక మూల ఒక చిన్న రూమ్‌ను ఏర్పాటు చేసుకుంటున్నారు. పిచ్చిజనులారా! ఇదా నా మంది రం? కాదు, కాదు. మీ హృదయమే నా మందిరం. మీరా చెప్పింది: “కృష్ణా! హమారా దిల్ తుమ్హారా మందిర్”. “నా హృదయమే నీ మందిరం కృష్ణా” అన్నది. కనుక మీరు కూడా మీ హృదయమే దైవమంది రమని భావించుకోవాలి. మీ ఇల్లంతా భగవంతునిదే; మీ ఉపయోగాలు చేసి చేసిగా ఉంచివున్నారని సర్వ త్ర భగవంతుడున్నాడు. అట్టి భగవంతునికి ఏదో ఒక మూల చిన్న గదిని కేటాయించడం ఎంతటి అపచారం! “సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్.” భగ వంతుడు లేని స్థానం లేదు. అన్ని రూపములూ తనవే, అన్ని నామములూ తనవే. అట్టి విశాలమైన దైవత్వాన్ని విశ్వసించలేక, పూజగదిలో ఏదో ఒక చిన్న ఫోటో పెట్టు కొని అదే భగవంతుడని భావిస్తున్నారు. అట్టి విశ్వాసం సరియైనది కాదు. రామాయణంలో లక్ష్మణుడు, “రామా! ఈ దేహం నీ సేవ నిమిత్తమై వచ్చినది కనుక, నీకే అర్పితం గావిస్తున్నాను” అన్నాడు. ఇంక భరతుడు, “రామా! నేను నీలోనే ఉన్నాను. నీలో నేనొక భాగ మును. నీవు, నేను వేరు కాదు” అన్నాడు. ఇట్టి ఏక త్వభావన చేతనే కొంత కాలానికి భరతునిలో రాముని తేజస్సు ఆవిర్భవించింది. లక్ష్మణునిది సేవాయోగం, భర తునిది నిష్ఠాయోగం. ప్రతి మానవుడు మొట్టమొదట బాహ్యమైన ఆరాధనతో ప్రారంభించి క్రమక్రమేణ అం తర్భావంలో దివ్యత్వాన్ని అనుభవించాలి.

### ఇంద్రియాల నరికట్టక మనస్సు వశం కాదు

మనకు కన్నుల నిచ్చినది ఎందుకోసం? పురం దరదాసు చెప్పాడు: “కన్ను లేలరా? స్వామిని చూడని కన్నులేలరా?” భగవంతుని చూడని కన్నులుండి ప్రయోజనమేమిటి? ఇదే విషయాన్ని సూరదాసు కూడా చెప్పాడు: “స్వామీ నాకు కన్నులు లేవని నేను బాధ పడటంలేదు. కాని, కన్నులున్న వారెందరూ నీ రూపు చూడగల్గుతున్నారా?”

*కన్నులుండి గ్రుడ్డులై కల్యాణకరమైన*
*నీరూపు దర్శింపనేరరైరి*
*చెవులుండి చవటలై అతి మనోహరమైన*
*నీగానమాలింపనేరరైరి”*

ఊరివారి సుద్దులు వినాలంటే చెవులు నిక్కబొడుచు కొని వింటాయి. కాని భగవంతుని గూర్చి వినాలంటే ఒక చెవి ఒకవైపు, మరొకచెవి మరొకవైపు పోతుంటాయి.

ప్రొద్దు పోక ఊరివారి సుద్దులంటే
మీరు సిద్ధమౌదురే కడు శ్రద్ధతోడ
ముద్దుముద్దుగాను భగవత్ ముచ్చటలు
చెప్పువేళ ఒద్దికగ నుండరే ఓ చెవులా?!''

ఇందుచేతనే చెప్పటం జరిగినది?! ఈ ఆధునిక యుగంలో చాలమంది తమ పంచేంద్రియాలను వశపర్చుకోకుండా మనస్సు నరికట్టుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఇది చాల పొరపాటు. పంచేంద్రియాలను వశపర్చుకున్న తరువాతనే మనస్సు నరికట్టుకోవడానికి వీలవుతుంది. మొట్టమొదట పంచేంద్రియాలను వశపర్చుకొని వాటిని పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి.

చెడు చూడవద్దు, మంచినే చూడండి.
చెడు వినవద్దు, మంచినే వినండి
చెడు అనవద్దు, మంచినే అనండి
చెడు తలచవద్దు, మంచినే తలచండి
చెడు చేయవద్దు, మంచినే చేయండి
ఇదే భగవంతుని చేరడానికి రాజమార్గం''

**త్రికరణశుద్ధియే మానవత్వం**

భగవంతుడు మన కెందుకీ చేతుల నిచ్చాడు? ఎందుకీ కంఠము నిచ్చాడు? ఎందుకీ శ్రోత్రములను యిచ్చాడు? వీటిని ఆభరణాలతో అలంకరించుకోవడానికా? కాదు, కాదు. హస్తమునకు దానమే భూషణం, సత్యమే కంఠమునకు భూషణం, శాస్త్ర శ్రవణమే శ్రోత్రములకు భూషణం. ఇంక ఈ భౌతికమైన అలంకారములు మన కెందుకు?!

''తల్లిగర్భము నుండి జన్మించునప్పుడు
కంఠమాల లవియేవి కానరావు
మంచిముత్యపు సరుల్ మచ్చునకున్ లేవు
మేల్మిబంగరు దండ మెడకు లేదు
రత్నాలహారముల్ రంజిల్లగా లేవు
పచ్చలపేర్లను పాతక లేదు
కలదు, కలదొక్కమాల మీ కంఠమందు
పూర్వజన్మల కర్మలు పొందుపరచి
మంచియైన చెడుగైన త్రుంచకుండ
బ్రహ్మ మీ కిచ్చి పంపును బరువుమాల
కర్మలన్నియు చేర్చిన కంఠమాల

ఈ మాల ప్రతి ఒక్కరి కంఠమునందు ఉన్నది. మంచో, చెడో మనం చేసిన కర్మల ఫలితమనే కంఠమాలను ధరించే వస్తున్నాము. కనుక ఏపనిచేసినా హృదయపూర్వకంగా చేయాలి. నీవెవరు? నీవు మనిషివి. కనుక నీ హృదయం, మాట, క్రియ మూడూ ఏకంగా ఉండాలి. సత్యసాయి సంస్థలలో విద్యార్థులకు అందించే విలువలతో కూడిన విద్యాబోధనను EHV (Education in Human Values) అంటున్నారు. కాని నేను దానిని EHV అనను, 3HV అంటాను. మొదటి H - Heart (హృదయం); రెండవ H - Head (తల); మూడవ H - Hand (చేయి). ఈ మూడు Hల ఏకత్వమే మానవత్వం.

**సీత క్షమాగుణం**

రావణ సంహారం జరిగిన తరువాత రామాజ్ఞాను సారం సీతను తీసుకురావడానికి హనుమంతుడు, సుగ్రీవుడు, విభీషణుడు ముగ్గురూ వెళ్ళారు. ఏ పుష్పక విమానంలో రావణుడు ఆమెను అపహరించి లంకకు తీసుకొని వచ్చాడో తిరిగి అదే పుష్పక విమానంలో కూర్చుని సీత రామునివద్దకు బయలుదేరింది. అప్పుడు హనుమంతుడు ''తల్లీ! ఈ అశోకవనంలో ఉన్న పది నెలలపాటు నిన్ను చాల హింసించారీ రాక్షసులు. నీవు ఆజ్ఞాపిస్తే వీరందరినీ ఒక్క క్షణంలో భస్మం చేస్తాను'' అన్నాడు. అప్పుడు సీత ''హనుమంతా! నీవు ఉద్రేక పడవద్దు. వీరు తమ ప్రభువాజ్ఞను శిరసావహించారే తప్ప స్వబుద్ధితో ఈ పని చేయలేదు. అంతేగాక హింసించడం రాక్షసుల స్వభావం. ఎవరి స్వభావం వారిది. కనుక మనం వారిని తిరిగి హింసించకూడదు'' అని పలుకుతూ ఒక చక్కని కథ చెప్పింది.

**అపకారికి ఉపకారం**

ఒక వేటగానిని ఒక పులి తరుముతూ రాగా తప్పించు కొనే మార్గంలేక వాడొక చెట్టెక్కాడు. ఆ చెట్టు

పై ఒక ఎలుగుబంటు నివసిస్తున్నది. దానిని చూసి ఆ వేటగానికి గుండె ఆగినంత పనయింది పాపం! "పైన ఉండే ఎలుగుబంటు తింటుంది, క్రిందికి దిగితే పులి తింటుంది. ఇంక నా గతి ఏమిటి?!" అని అతడు విచారిస్తుండగా ఇంతలో క్రింద నుండి పులి, "ఓ ఎలుగుబంటూ! నాకు చాల ఆకలిగా ఉన్నది. వాణ్ని క్రిందికి నెట్టివేయ్. నా ఆకలి తీర్చుకొని వెళ్ళిపోతాను" అన్నది. అప్పుడా ఎలుగుబంటు, "ఓ పులీ! ఈ వేటగాడు నా గృహానికి అతిథిగా వచ్చాడు. అతిథి అభ్యాగతులను ఆదరించడం నా లక్షణం. కనుక నేనితడిని క్రిందికి నెట్టను" అన్నది. ఈ మాటలు విని పులి మారుమాట్లాడక ఆ చెట్టు క్రిందనే కూర్చుని నిరీక్షించసాగింది. కొంత సేపటికి ఆ ఎలుగుబంటుకు నిద్ర వచ్చింది. అది గమనించి పులి, "ఓ వేటగాడా! ఆ ఎలుగుబంటు నిద్రపోతున్నది కదా! దానిని క్రిందికి నెట్టు. నాకు చాల ఆకలిగా ఉన్నది. దానిని తిని నిన్ను వదలిపెట్టి వెళ్ళిపోతాను" అన్నది. ఆ వేటగానికి కృతజ్ఞత లేదు. తనను తాను రక్షించుకోవాలని నిద్రపోతున్న ఆ ఎలుగుబంటును క్రిందికి నెట్టాడు. అదృష్టవశాత్తు దానికి తక్షణమే మెలకువ రాగా చేతికందిన చెట్టుకొమ్మ పట్టుకొని తిరిగి పైకి ఎగబ్రాకింది. అప్పుడా పులి ఎలుగుబంటుతో, "చూశావా! నీవు అంత ఉపకారం చేసినా వాడు కృతజ్ఞత లేకుండా నిన్ను క్రిందికి నెట్టాలని ప్రయత్నించాడు. ఇంక ఆలస్యం చేయక ఆ కృతఘ్నుణ్ణి క్రిందికి నెట్టివేయ్, నేను తిని వెళ్ళిపోతాను" అన్నది. అప్పుడా ఎలుగుబంటు, 'ఓ పులీ! అది అతని స్వభావమేకాని, నా స్వభావం కాదు. ఎవరి స్వభావం వారిది. కనుక నన్ను ఆశ్రయించిన ఈ వేటగానికి అపకారం తలపెట్టను' అన్నది.

### భ్రమ వీడక బ్రహ్మ చిక్కడు

ప్రేమ స్వరూపులారా! భ్రమ మీలోపల ఉన్నంత వరకు బ్రహ్మ మీకు చిక్కడు. దేహాభిమానం ఒక భ్రమ, కుటుంబాభిమానం ఒక భ్రమ, ధనాభిమానం ఒక భ్రమ, అధికారాభిమానం ఒక భ్రమ. ఇన్ని భ్రమలతో కూడినవానికి బ్రహ్మ ఏరీతిగా చిక్కగలడు?

"పుట్టుట ఒక చింత, భూమి నుండుట చింత
సంసారమొక చింత, చావు చింత
బాల్యమంతయు చింత, వార్ధక్యమొక చింత
జీవించుటొక చింత, చెరుపు చింత
కర్మలన్నియు చింత, కష్టములొ ఒక చింత
సంతసమొక చింత, వింత చింత!"

[illegible] నిండు హృదయాన్ని మనం చింతలు లేకుండా ఉంచాలంటే ఎట్లా ఉండగలం? "సర్వచింతలు బాపెడి సర్వేశ్వర భక్తి గొనుడు ఇదనైన ప్రజలార కోర్కె మీర" సర్వేశ్వర భక్తిచేతనే సమస్త చింతలూ పటాపంచలై పోతాయి. కనుక ఏ నామమైనా సరే, ఏ రూపమైనా సరే, హృదయపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థించండి. ప్రేమస్వరూపులారా! మీరు పాద పూజలు, పాదుకాపూజలు చేస్తున్నారు. చాల సంతోషమే! ఈ పవిత్రమైన కర్మలకు పవిత్రమైన ఫలితం చిక్కుతుంది. కాని ఇది ఆధ్యాత్మికం కాదు. ఇది చక్కగా గుర్తుంచుకోండి. కేవలం ఆత్మకు సంబంధించినది మాత్రమే ఆధ్యాత్మికం. "శ్రవణం కీర్తనం విష్ణో స్మరణం పాదసేవనం వందనం అర్చనం దాస్యం స్నేహం ఆత్మనివేదనం" ఇవన్నీ భగవంతుని చేరుటకు ఉపకరించే సాధనలే! ఈ సాధనలకు తగిన ఫలితం ఉంటుంది. అయితే ఆత్మభావంతో దృష్టిని అంతర్ముఖం గావించుకున్నప్పుడే సర్వమూ సిద్ధిస్తుంది.

### ఇకపై రథాలు, సింహాసనాలు లేకండి

మధురైకి చెందిన సుబ్రహ్మణ్య చెట్టియార్ అనేక సంవత్సరాల నుండి చాల శ్రమలకోర్చి ఈ పాదుకల సేవను నిర్వహిస్తున్నాడు. ఆ వయస్సులో ఇంత బాధ్యత వహించడం చాల కష్టం. నా ఉద్దేశ్యంలో ఇంత వరకు అతడు [illegible] అందించిన సేవ చాలు, ఇకపై

[illegible] నిస్వార్థపరతను తగిన కృషి చేయాలని ఆశిస్తున్నాను. అయితే పరోపకారం చేయుటంలోనే నిస్వార్థపరత ఉన్నది; పరోపకార నిమిత్తమై చేసిన పనులు పరమాత్మనే చేరుతాయి. కాని ఇంక ఈ బాహ్యతను కాను చేయట్టరేమ. ఈనాడు ముఖ్యంగా మీరు రథమును గూర్చి చెప్పవలసివస్తున్నది. మీరు నమ్మినా నమ్మకపోయినా నాకిలాంటివి ఇష్టంలేదు. భగవంతునికి ఇవ్వవలసింది నిర్మలమైన ప్రేమ మాత్రమే. ''లవ్ ఈజ్ గాడ్. గాడ్ ఈజ్ లవ్''. ప్రేమయే పరమాత్మయు. కనుక ప్రేమను మాత్రమే నాకు అందించాలిగాని ఈలాంటి పల్లకీలు, రథాలు తెచ్చి నాతలపైన భారం వేయడమెందుకు?! ఇలాంటివి నేనెప్పుడూ ఆశించను. వీనికి బదులు ఈ ఖర్చుతో సమాజంలో ఎంతైనా సేవలు చేయవచ్చు. భగవంతునికి, ఎక్కడికి పోయినా, ఇవ్వవలసింది నిర్మలమైన ప్రేమయే. ఇలాంటివి మీరెక్కడా ఇవ్వకండి. ఇలాంటివి ఆశించేది దైవత్వం కాదు. దైవమే సర్వస్వరూపుడై యుండగా దైవానికి ప్రత్యేకంగా అర్పించుటమేమిటి?! అసలు అర్పించడానికి మీరెవరు?! సర్వమూ భగవంతునిదే. కనుక మీరు ఇకముందు ఇలాంటి ఆభరణాలుగాని, సింహాసనాలుగాని, రథాలుగాని తీసుకొని రాకండి. ఈ ఖర్చుతో నీరు లేని ప్రదేశంలో ప్రజలకు నీరివ్వండి.

**''మీరు నావారు, నేను మీ వాడను''**

ప్రాచీన కాలమునుండి విద్యావైద్యములను ఉచితంగా అందించడం మన భారతీయ సాంప్రదాయం. కాబట్టి నేను విద్యా వైద్యములను ప్రజలకు ఉచితంగానే ఇస్తున్నాను. ఈనాటి వరకు నేనికీ ఒక్క నయాపైసా తీసుకోవడంలేదు. ట్యూషన్ ఫీజుగాని, లైబ్రరీ ఫీజుగాని, ల్యాబొరేటరీ ఫీజుగాని, గేమ్స్ ఫీజుగాని, ఎగ్జామినేషన్ ఫీజుగాని ఏదీ మేము తీసుకోవడం లేదు. ఇట్లా ప్రపంచంలో ఎక్కడా లేదు. ఆసుపత్రిలో కూడా ఎంత ఖర్చైనా అంతా ఫ్రీగానే ఇస్తున్నాము. మీరందరూ నా వారే! నా వారికి నేనిచ్చుకోవడంలో ప్రత్యేకత ఏమున్నది?! నీ కుమారునికి నీవు బట్టలు తెస్తే అడ్వర్టైజ్ చేసుకుంటావా? అదేవిధంగా నావారికి నేను ఇచ్చుకుంటున్నాను. అంతా నావారే, నేను మీవాడను. మనం ఇచ్చుకోవడం, పుచ్చుకోవడం ప్రేమకు ప్రేమయేగాని మరొకటి కానేరదు. హార్ట్ టు హార్ట్, లవ్ టు లవ్! సుబ్రహ్మణ్య చెట్టియార్ ఏమైనా అనుకోనీ గాని ఎవరైనా తగిన మొత్తాన్నిచ్చి ఈ రథాన్ని తీసుకుంటే ఆ డబ్బుతో ఇంకా కొన్ని గ్రామాలకు నీరిస్తాను. సుబ్రహ్మణ్య చెట్టియార్ ఎంతో ప్రేమతో ఈ రథాన్ని తీసుకొని వచ్చాడు. అతనికి ఒకే ఒక వాంఛ ఉండినది. ''నా కళ్ళముందు స్వామి రథోత్సవం జరగాలి. తరువాత నేను ఉన్నాసరే. పోయినా సరే'' అని నిశ్చయించుకున్నాడు. అంతటి నిశ్చల చిత్తంతో ఉన్నాడు. అతనికోసమే నేనీనాడు రథము నెక్కాను గాని, లేకపోతే దానిని నేను ముట్టేవాడినే కాను. ఇలాంటి వాంఛలు నాకెప్పుడూ లేవు. ఇవి మీయందు కూడా ఉండరాదు. భగవంతునికి, భక్తునికి మధ్య ఉండవలసింది అంతర్ సంబంధమేకాని బాహ్య సంబంధం కాదు. అట్టి అంతర్ సంబంధాన్ని మీరు అభివృద్ధి గావించుకోవాలి; నిర్మలమైన ప్రేమను పెంచుకోవాలి; నిస్వార్థ కర్మల నాచరించాలి. దైవప్రీతిని, పాపభీతిని, సంఘనీతిని పెంచుకోవాలి. ఈ విధమైన మార్గాన్ని అనుసరించి, భక్తిప్రపత్తులచేత భగవదనుగ్రహానికి మీరు పాత్రులు కావాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా దీర్ఘప్రసంగాన్ని విరమిస్తున్నాను.

(తేది : **22.9.97** సాయంత్రం సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

* * * * * *

# సత్య రథోత్సవం

శ్రీవైకుంఠ రథమ్ము దింపితివి పర్తిక్షేత్ర మధ్యమ్ములో
ఆ వాల్లభ్య మహారథంబమరె స్వర్ణాదిత్య దివ్యప్రభా
భావోద్భాసిత రామ పుష్పకముగా బ్రహ్మాంచ దిబ్బుండరిన్
శ్రీ విష్ణూ జయసాయినాథ! ప్రణతుల్ ప్రేమావతార ప్రభూ!

వేలుపు పెద్దయైన తమ పెద్ద కుమారుడు బ్రహ్మ యేడు నె
జ్వాలు గలట్టి వేవెలుగు రవ్వల బంగరుతేరు తెచ్చి ప
గ్గాలను బూని పట్టుకొనగా రథపీఠముపై నినున్ గనన్
చాలవు రెండునేత్రములు సాయిజనార్దన! సత్యసుందరా!

అదిగో బ్రహ్మరథంబు అంచు మునులాత్మానందమున్ జెంద - రా
దది శ్రీశంభు రథంబు అంచు ఘనులాహ్లాదింప - వీక్షించి కా
దది ఆదిత్యరథంబుపై సకల దేవాధీశ్వరుల్ కొల్వ సా
హ్యాడుడై వచ్చెను సాయిరాముడని హర్షించెన్ కృపాపాత్రముల్॥

త్రిపుర సంహారమున నెగు దేవు పైన
శివుడు శక్తితో వచ్చిన విధిని బోలె
సర్వదేవ ప్రజలు వెంట నాగరాగ
స్వామి తాపత్రయాలార్పి వచ్చెనేమొ॥

స్వామి! నీ రథవైభవోత్సవము జూడ
రెండు కనులు చాలవని నరుండు తలచె
మూడు కనులు చాలవని శంభుడు తలంచె
వేయి కనులు చాలవని దేవేంద్రుడనెను॥

ఒక్కొకరికి తోచె నొక్కొక్క విధముగా
వారి వారి బుద్ధి బలము ఎట్టి
చేసికొన్నవారి చిరపుణ్య ఫలముగా
కానుపించె వివిధ గతుల స్వామి॥

"శాంతి శ్రీ" బంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి
(ప్రశాంతి నిలయం)

# పసిడి తేరు

సీ॥ విశ్వగర్భుండునై వెలయు దేవుం డీశ్వరాంబగర్భంబున నవతరించి
ఇంద్రాది సురవరు లీక్షింపనేరని బ్రహ్మంబు నరుడుగా ప్రభవమంది
వేదశాస్త్రంబులు వెదకి కానగలేని తత్త్వమీ భూమిపై తనువు దాల్చి
సనక సనందన మునిమానసములందు వెలుగు దీపము పర్తి వెల్లివిరిసి

గీ॥ మోక్షలక్ష్మీ సనాథంబు మోహనంబు
నగుచు రూపించి పసిడి తేరందగించి
తిరుగు దృశ్యంబు చూచెడు పరమ భాగ్య
మబ్బినందుకు జన్మ కృతార్థమయ్యె.

బి. రామరాజు (హైదరాబాద్)

# భక్తి - క్రమశిక్షణ - కర్తవ్యపాలన

ప్రేమాత్మస్వరూపులారా!

అహంకారంతో జీవించినంత కాలము మానవుణ్ణి ఎవ్వరూ ప్రేమించరు, చివరికి భార్యాబిడ్డలు కూడా ప్రేమించరు. అహంకారాన్ని విసర్జించినప్పుడే మానవుడు విశ్వప్రేమునకు అర్హుడవుతాడు. క్రోధం ఉన్నంత వరకు మానవుణ్ణి శోకం వదలదు. వాంఛలున్నంతవరకు శ్రీలక్ష్మి మానవుని చెంత చేరదు. ఇంత లోభమున్నంతవరకు మానవుడు సుఖాన్ని అనుభవించలేడు. లోభముచేతనే దుర్యోధన దుశ్శాసనాదులు సకల సంపదలకు దూరమయ్యారు. టంబ్లరు నిండుగ నీరున్నంతవరకు అందులో పాలు పోయడానికి వీలుకాదు. నీరును పారబోసినప్పుడే దానిలో పాలు పోయడానికి వీలవుతుంది. అదేవిధంగా మన తలలో నిండిన దుర్గుణాలను మొట్టమొదట దూరం చేసుకోవాలి. అప్పుడే మనలో సద్గుణాలను చేర్చుకోవడానికి వీలవుతుంది.

ఆకాశంలో ప్రకాశించే సూర్యుడు భూమిపై జలముతో నింపబడిన బంగారుపాత్రలోను, వెండి పాత్రలోను, ఇత్తడిపాత్రలోను, మట్టిపాత్రలోను ఒకే విధంగా ప్రతిబింబిస్తాడు. బంగారమునకు, వెండికి, ఇత్తడికి, మట్టికి విలువలు వేరువేరుగా ఉంటాయి గాని, ఆయా పాత్రలలోని జలములో కనిపించే సూర్యుని ప్రతిబింబమునకు విలువ ఒక్కటే! ఒక్కొక్క పాత్రలో ఒక్కొక్క సూర్యుడు కనిపిస్తాడుకాని ఉన్నది ఒకే సూర్యుడు కదా! ఒక్క సూర్యుడు సమస్త లోకములకు ఒక్కొక్కడై తోచునట్లుగా, ఒకే భగవంతుడు ఒక్కొక్క హృదయమందు ఒక్కొక్క భావమును పురస్కరించుకొని రామ, కృష్ణ, గోవింద, నారాయణ, సాయి మున్నగు వివిధ రూపాలతో సాక్షాత్కరిస్తున్నాడు. రూపనామములు వేరుకాని, దైవమొక్కడే. ఈ సత్యాన్ని ప్రతి వ్యక్తి గుర్తించి వర్తించాలి. "ఏకోహం బహుస్యాం". ఒక్కడే అనేకంగా గోచరిస్తున్నాడు. ఈ అనేకత్వానికి కారణం ఉపాధిభ్రాంతియే.

మానవదేహ మొక కారువంటిది. కారుకు నాల్గు చక్రాలున్నట్లుగా మానవ జీవితానికి ధర్మార్థ కామ మోక్షాలనే నాల్గు పురుషార్థములు నాల్గుటైర్లుగా ఉన్నాయి. టైర్లున్నంతమాత్రమున చాలదు; అందులో గాలి ఉండాలి కదా! అదే విశ్వాసం. పురుషార్థములనే టైర్లయందు విశ్వాసమనే గాలి బాగా ఉన్నప్పుడే దేహమనే కారు ముందుకు పోగలదు. అయితే లోపల స్టీరింగ్ ఎలా తిరుగుతే టైర్లు అలా తిరుగుతాయి కదా! ఆ స్టీరింగే మనస్సు. కారు స్టార్ట్ కావాలంటే స్విచ్ చాల ప్రధానమైనది. అదే బుద్ధి. మన కడుపే పెట్రోల్ ట్యాంకు. మనం భుజించే ఆహారమే పెట్రోలు. ఈ దేహమనే కారులో కూర్చుని ఆత్మ అనే దేవుడు డ్రైవ్ చేస్తున్నాడు. ఇట్టి ఆత్మను ఆధారంగా చేసుకున్నప్పుడే మనం చేరవలసిన స్థానమునకు సుఖంగా చేరుతాము.

ఒకానొక పల్లెలో వాటర్ సప్లై నిమిత్తమై ఒక బోర్ వెల్ వేసి పెద్దట్యాంక్ కట్టారు. ఆ ట్యాంకుకు పైపులు పెట్టారు. వాటర్ సప్లైని ప్రారంభించడానికి ఒక మినిష్టర్ ని ఆహ్వానించారు. ప్రారంభోత్సవానికి ఒక మంచి బంగారు ట్యాప్ ఏర్పాటు చేశారు, దాని క్రింద మంచి వెండి పాత్ర పెట్టారు. మినిష్టర్‌కు దండవేశారు. ఆయన ప్రారంభోత్సవం చేయడానికి ట్యాప్ దగ్గరికి వెళ్ళి దానిని త్రిప్పాడు. కాని నీరు రాలేదు! కారణమేమిటి? ఆ ట్యాప్‌కు, ట్యాంక్‌కు కనెక్షన్ చేయబడలేదు! అదేరీతిగా మనం నోటితో నామస్మరణ చేస్తున్నాము, చేతులతో తాళం వేస్తున్నాము. కాని హృదయానికి, ఆత్మకు

సంబంధం చేయడం లేదు. హృదయార్పిత భావం లేకుండా కేవలం బాహ్యంగా నామస్మరణ చేస్తే ప్రయోజనం లేదు. హృదయానికి, దైవానికి సరియైన సంబంధాన్ని పెట్టుకోవాలి. రావణుడు ప్రతిరోజు అనేక వేల శివాలయాలకు ప్రదక్షిణ చేసి శివార్చన చేసేవాడు. కాని ఏమి ప్రయోజనం? తన హృదయానికి, దైవానికి ఏమాత్రం సంబంధం చేయలేదు. కనుకనే అతడు రాక్షసునిగానే నిల్చిపోయాడు. కనుక హృదయార్పిత భావం లేకుండా నామస్మరణ చేసేవారంతా రావణుని సంతతివారనే చెప్పవచ్చు. మన మనస్సును భగవంతుని వైపు మరల్చాలి.

పాదుకలపూజ చేసేటప్పుడు మీ దృష్టి భగవంతుని పాదములపైననే నిలవాలి. చేతితో పూలు వేస్తూ మనస్సును మార్కెట్‌కు పంపితే పూజ చేసి ఏమి ప్రయోజనం? భరతుడు శ్రీరామచంద్రుని పాదుకలను తీసుకువచ్చి **14** సంవత్సరములపాటు మానసికంగా తాను శ్రీరాముని పాదములలో లీనమై పోయాడు. ఈనాడు మీ మనస్సు కేవలం సృష్టిని గూర్చి విచారిస్తున్నదికాని సృష్టికర్తను గూర్చి విచారించటం లేదు. మనోతృప్తి నిమిత్తమై మీరు అనేక కర్మల నాచరిస్తున్నారు. మనస్సును తృప్తి పర్చడం ఎవ్వరికీ సాధ్యం కాదు. మనస్సునే మరచిపోవాలి, మీరు అమనస్కులు కావాలి. అప్పుడే మీకు ఆనందం ప్రాప్తిస్తుంది. అయితే మీరు అమనస్కులు కావాలంటే ఏమి చేయాలి? దైవాన్ని తప్ప మరొక విషయాన్ని చింతించకూడదు. ఒకానొక సమయంలో ద్రోణాచార్యుడు కౌరవపాండవులకు విలువిద్యలో ఒక పరీక్ష పెట్టాడు. ఒక చెట్టుకొమ్మకు పక్షిని కట్టి ముందుగా దుర్యోధనుణ్ణి పిల్చి దానిని కొట్టమన్నాడు. దుర్యోధనుడు విల్లును ఎక్కు పెట్టి గురి చూస్తున్న సమయంలో, "దుర్యోధనా! అక్కడ నీకేమి కనిపిస్తున్నది?" అని ప్రశ్నించాడు. "గురువర్యా! ఆ వృక్షము, దానికొమ్మలు, పక్షి, దాని వెనుకనున్న ఆకాశము... అంతా కనిపిస్తున్నది" అన్నాడు. "ఇదే కొద్దిసేపు ఆగు, అని కౌరవులందరినీ ఒకరితరువాత ఒకరిని పిలిచి ఇదే ప్రశ్న వేశాడు. అందరూ అదే సమాధానం చెప్పారు. తరువాత పాండవులను పిలిచాడు. పాండవులలో ఒక్క అర్జునుడు మాత్రం, "గురువర్యా! నాకు ఆ పక్షి తప్ప వేరేమీ కనిపించడం లేదు" అన్నాడు. అదే సహజమైన ఏకాగ్రత. దేనిని సాధించాలనుకున్నామో దానిపైననే మన లక్ష్యం పెట్టాలి. మిగిలిన విషయాలను లెక్క చేయకూడదు.

మీకు దైవం కావాలను కున్నప్పుడు మీలో పరిపూర్ణమైన ప్రేమను పెంచుకోవాలి. ఎందుకంటే పరిపూర్ణ ప్రేమస్వరూపుడే దైవం. దైవం ఎక్కడో ప్రత్యేకంగా లేదు; మీలోపల, వెలుపల, పైన, క్రింద సర్వత్ర వ్యాపించియున్నాడు. దైవాన్వేషణ సల్పుతున్నామని అంటారు కొంతమంది. దైవాన్వేషణ అనే పదము చాల హాస్యాస్పదమైనది. సర్వత్ర ఉన్న దైవాన్ని అన్వేషించడమేమిటి?! అయితే దైవం ప్రేమనేత్రానికి మాత్రమే కనిపిస్తాడు. మీలో ప్రేమనేత్రం లేకపోవడంచేత మీకు దైవం కనిపించడం లేదు. ఈ లౌకికమైన తెలివితేటలచేత మీరు ప్రేమను పూర్తిగా కోల్పోతున్నారు. "వానలు వచ్చె నంచు భువి పండునె విత్తులు నాటకున్న? ఆ వానలు లేనిచో ఫలము నివ్వునె విత్తులు నాటియున్న?" విత్తనమూ నాటాలి, వర్షమూ రావాలి. అదేవిధంగా మన హృదయక్షేత్రంలో నామమనే విత్తనమునూ నాటాలి, దానిపై ప్రేమ అనే వర్షమూ కురవాలి. అప్పుడే ఫలసిద్ధి కల్గుతుంది.

మీకున్న సర్వాంగములనూ పవిత్రం గావించుకోవాలి. ఒకానొక సమయంలో తులసీదాసు, "రామా! నన్నెందుకు అంగహీనుని గావించావు?" అని చాల బాధపడ్డాడు. అప్పుడతని చుట్టూ ఉన్న శిష్యులు, "స్వామీ! మీకేమి తక్కువ? అన్ని అంగములూ మీకు చక్కగానే ఉన్నాయి కదా!" అన్నారు. "ఉండి ఏమి ప్రయోజనం నాయనా? చేతులున్నాయి

కాని రాముని పిలువలేకపోతున్నాను; కన్నులున్నాయి కాని రాముణ్ణి దర్శించలేకపోతున్నాను; చేతులవలె చెవులున్నాయి కాని రాముని మాటలను వినలేకపోతున్నాను. కనుక నేను అంగహీనుడ్నే కదా!'' అన్నాడు. ఇదెంతటి గొప్ప భావము! కాని ఈ కలి ప్రభావంచేత భక్తులు భగవత్ శక్తినే శంకిస్తున్నారు. ''నిజంగా భగవంతునిలో శక్తి ఉంటే ఎందుకు నా కష్టాలను నివారించటం లేదు? ఎందుకు నా భక్తిని మెచ్చుకోవడం లేదు? ఎందుకు నా దగ్గరకు రావటం లేదు?'' అని తామేదో గొప్ప భక్తులమనీ, భగవంతుడే శక్తిహీనుడనీ భావించుచుంటున్నారు. తమకు ఏమైనా కష్టనష్టములు సంభవించాయంటే ఈవిధమైన బలహీనతలకు గురి అవుతుంటారు. దేనిలో బలహీనులయినా ఫరవాలేదుకాని దైవవిశ్వాసంలో మాత్రం బలహీనులు కాకండి. భగవద్విశ్వాసమే మనలను ఈ భవసాగరాన్ని దాటించ గలదు. కనుక భగవంతునిపై అమితంగా విశ్వాసాన్ని పెంచుకోండి.

దివ్యాత్మస్వరూపులారా! ఈ మూడు దినముల నుండి మధురై పాదుకా ట్రస్టువారు చక్కని ఆదర్శాన్ని నిరూపిస్తూ వచ్చారు. మంగళవాయిద్యాలు వాయించే వారు మొదలుకొని మంత్రాలు చెప్పే పండితుల వరకు పూజలు చేసే వ్యక్తులతో సహా అందరూ ఐకమత్యంగా ఒకరినొకరు అనుసరిస్తూ చక్కని ఆదర్శాన్ని నిరూపించారు. ఏ సమయానికి ఎవరిచేత ఎక్కడ ఏది జరగాలో అది చక్కగా స్విచ్ ఆన్ చేసినట్లుగా జరిగిపోయింది. సన్నాయి మేళంవారు సమయసందర్భానుసారంగా చక్కని పాటలను వినిపించారు. పండితులు కూడా మంచి స్వరంతో సుస్పష్టంగా మంత్రాల నుచ్చరించి దివ్యమైన వైబ్రేషన్‌తో వాతావరణాన్ని ప్రభావితం చేశారు. ప్రతి రాష్ట్రమువారు ఈవిధమైన ఆదర్శాన్ని అనుసరించాలనినేను ఆశిస్తున్నాను. కాని కొన్నికొన్ని రాష్ట్రాలలో ఐకమత్యం చాల తక్కువగా ఉన్నది. యూనిటీ (ఐకమత్యం) ఉన్నచోటే ప్యూరిటీ (పవిత్రత) ప్రవేశిస్తుంది; ప్యూరిటీ ఉన్నచోటే డివినిటీ (దివ్యత్వం) వెల్లుగుతుంది. మధురై పాదుకాట్రస్టువారు ఈ సత్యాన్ని చక్కగా నిరూపించారు. ఇంత వృద్ధుడై యుండి ఏమీ తెలియనట్లుగా కనిపించే సుబ్రహ్మణ్యా చెట్టియార్ తన మాటలతో అందరినీ ఆకర్షించుకొని, అందరినీ ఏకంగా కలుపుకొని పనిచేస్తూ వస్తున్నాడు. అతని కుమారుడు, అల్లుడు కూడా అతనికి చేదోడువాదోడుగా ఉంటూ దీనిని చక్కగా అభివృద్ధి గావిస్తున్నారు. ఈవిధమైన ఐకమత్యముంటే ఎంతైనా సాధించవచ్చు. ఐదు వ్రేళ్ళు కలిసినప్పుడు ఎంతటిపనైనా చేయవచ్చు, ఒక్కొక్క వ్రేలు ఏమిపని చేయగలదు?! వచ్చిన భక్తులు, సాధకులు, ఆ కమిటీ మెంబర్లు అందరూ ఐకమత్యంగా పని చేయడం వల్లనే ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించగల్గారు. ఈ రోజు తెల్లవారు ఝామున జరిగిన పాదుకల పూజలో ఇన్నివేలమంది పాల్గొన్నప్పటికీ పిన్‌డ్రాప్‌సైలెన్స్‌గా ఉన్నారు; ఎక్కడా చిన్నపిల్ల ఏడ్చినట్లు కూడా లేదు. ఈ నిశ్శబ్దంలోని శబ్దమే భగవత్స్వరూపం. బ్రహ్మ ఎక్కడున్నాడంటే నిశ్శబ్దంలోని శబ్దంగా ఉంటు న్నాడు. మన చెవులు తెరుచుకొని ఉన్నంతవరకు అన్ని రకములైన శబ్దాలు మనకు వినిపిస్తాయి. ఒక్కసారి చెవులు పూర్తిగా మూసుకోండి, లోపల 'ఓం' అనే దివ్యమైన శబ్దం మీకు వినిపిస్తుంది. కనుక నిశ్శబ్దంలోని శబ్దమే బ్రహ్మము. భగవంతుడు మీ వెంటనే నడుచుకుంటూ వస్తుంటాడు. మీరు నిశ్శబ్దంగా ఉన్నప్పుడే అతని అడుగుల సవ్వడి వినడానికి వీలవు తుంది. కనుకనే ''ది సౌండ్ ఆఫ్ సైలెన్స్ ఈజ్ గాడ్'' అన్నారు. మీరు నిశ్శబ్దంగా ఉండాలి. మధురై పాదుకా ట్రస్టువారు ఈ డిసిప్లిన్ (క్రమశిక్షణ)ను చక్కగా పాటిస్తూ వచ్చారు. వారిలో డిసిప్లిన్, డివోషన్, డ్యూటీ మూడూ ఉంటున్నాయి. మున్ముందు కూడా వారు ఇదేవిధంగా నడుచుకొని లోకానికి చక్కని ఆదర్శాన్ని అందిస్తారని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

**(తేది : 23-9-1997 సాయంత్రం సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)**

# శ్రీసాయి సూర్యగాయత్రీదర్శనం

ఆ రోజు ఈశ్వర భాద్రపద బహుళ షష్ఠి సోమవారం ఉదయం 7.05 ని॥లు అయినది. ఆ శుభ ముహూర్తాన **అవతారమూర్తి శ్రీ సత్యసాయి భగవానుడు** కాషాయాంబరధారియై ప్రాతః సంధ్యారాగాలు విరజిల్లు పవిత్ర సమయంలో **ఈశ్వరుడు కైలాసం నుంచి** వచ్చినట్లు స్వామి **నటరాజ విగ్రహాలంకృత పూర్ణచంద్ర భవనం** నుండి బయలుదేరి, దివ్యసప్తాశ్వసువర్ణ రథమును అధిరోహించి సువర్ణఖచిత ఛత్రచామరవ్యజనమాలాసహిత బంగారు సింహాసనంలో సుఖాసీనులైనారు. మంగళవాద్యాలతో, వేదపండితుల స్వస్తివాచకములతో, సాయి విద్యాలయ విద్యార్థులవేదపఠనంతో వివిధ వేషాలు. ప్రాంతాలనుండి తండోపతండాలుగా వచ్చిన సాయి సేవాదళ సంఘ సభ్యులు ఆ దివ్యరథాన్ని సాయీశ్వరుని కలియుగ వైకుంఠమైన **ప్రశాంతి మందిరానికి** నడిపించినారు. ఆ సప్తాశ్వరథసారథి బంగారు చతుర్ముఖ బ్రహ్మ విగ్రహరూపమే.

***దీని అంతరార్థం:*** స్కాందాది పురాణాలలో శివుడు శక్తితో కలిసి మయ బ్రహ్మానిర్మిత సప్తలోక బ్రహ్మాండ రథాన్నధిరోహించి చతుర్ముఖ బ్రహ్మగారి సారథ్యంలో త్రిపురాసుర సంహారానికి బయలుదేరాడని ఉన్నది. అట్లనే, ఈ సాయి (సా+అయీ=శివశక్తి) సువర్ణ ఆదిత్యసప్తాశ్వ (సప్తలోక) రథాన్నధిరోహించి త్రిపురాన్ని అంటే దేహంలో ఈషణాత్రయ, తాపత్రయ, త్రిదోషాలను పరిహరించుటకు బయలుదేరుచున్నట్లు స్ఫురించుచున్నది.

శ్రీ సత్యసాయి పరమాత్ముడు ఆదిత్య సువర్ణ సింహాసనము నధిష్ఠించియుండి, అసంఖ్యాక భక్తులు, పండితులు, అధ్యాపకులు, విద్యార్థులు, సాధ్వీమ తల్లులకు దివ్యదర్శనాన్ని ప్రసాదించారు. ఆ ప్రశాంతి మందిర ప్రాంగణం అలంకారాలతో, జాజ్వల్యమానదీపకాంతులతో విరాజిల్లినది. ఆ మధ్యలో విభూతి సుందరుడు శ్రీ సత్యసాయి భగవానుడు అనుగ్రహ, అభయ హస్తచాలనం చేయుచూ అశేష భక్తబృందాన్ని ఆనందంలో ముంచివేశారు కదా!

ఆ అత్యద్భుత దివ్యదర్శన సమయంలో భగవాన్ బాబావారు ఇచ్చిన చైతన్య స్ఫూర్తితో సాయిసూర్య గాయత్రీ మంత్రరూపం నా హృదయంలో విద్యుల్లేఖయై తళుక్కున మెరసినది.

ఓం భాస్కరాయ విద్మహే సాయిదేవాయ ధీమహి॥
తన్నః సూర్యః ప్రచోదయాత్॥

**ఈ మంత్రార్థం :** ప్రకాశమానుడై విరాజిల్లు సాయిని దివ్యస్వరూపునిగా తెలిసికొనుచున్నాము. ఆ పరంజ్యోతి రూపుడైన సాయి సూర్యభగవానుడు మా అంతఃకరణచతుష్టయాన్ని సత్కర్మానుష్ఠానమందు ప్రేరణ చేయునట్లు ప్రార్థించుచున్నాము.

ఈ సాయిసూర్యమహస్సు నిత్య, శుద్ధ, బుద్ధ చైతన్యమే కదా! ఈ సాయిసూర్యగాయత్రి **24** అక్షరాలతో, పాదానికి ఎనిమిది అక్షరాలతోయున్న మంత్రరూపంగా ఆవిర్భవించినది.

***మంత్రఫలశ్రుతి :*** ఈశపదాన్ని వ్యస్తాక్షరి చేస్తే ఈశ > శాయి > సాయి అని అగును. ఈశ్వరుడు (సాయి) ఆయుష్కరుడు. ఇక భాస్కరుడు ఆరోగ్యప్రదాత. అందుచే ఈ సాయిసూర్యగాయత్రిని భక్తిశ్రద్ధలతో జపించిన వారికి ఆయురారోగ్యములు కలుగును.

ఇది ప్రత్యక్ష భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి వినయ పూర్వకంగా, హృదయ పూర్వకంగా అర్పించుచున్నాను.

ఘండికోట వెంకటసుబ్బారావు (ప్రశాంతినిలయం)

# శ్రీ సత్యసాయి స్వర్ణరథారోహణ ఘట్టము

కలియుగావతార శ్రీ సత్యసాయి భగవానుని దివ్య వైభవ ప్రకటనాంశములలో వర్ణనాతీతంగా వెలుగొందిన ఆశ్చర్యకరమైన అద్భుతాంశము ఈ సత్యసాయి స్వర్ణాదిత్య పాదుకా రథారోహణము. ఈ వైభవోపేతమైన ఘట్టము కడు సంభ్రమాశ్చర్యకరమైన చారిత్రాత్మక ప్రాముఖ్యతను సహా సంతరించుకొనియుండుట గొప్ప విశేషం. సెప్టెంబర్ 22వ తేది. సోమవారం, ఉదయం 7 గం. 5 ని.లకు కన్యాలగ్నమునందు రోహిణీ నక్షత్ర చంద్రకాల హోరా సమయమున శ్రీవారి స్వర్ణాదిత్యపాదుకా రథారోహణమును చూచిన కన్నులే కన్నులు. కన్నవారి భాగ్యమే భాగ్యము. స్వర్ణరథముగా, సూర్యరథముగా, కృష్ణరథముగా ఇంకెన్నో విధములుగా వర్ణింపబడి తళతళ మెరిసి పోతున్న ఆరథము యొక్క అందమును వర్ణింప ఎవ్వరికీ సాధ్యం కాదు. ముందు భాగమున చతుర్ముఖ బ్రహ్మ సప్తాశ్వముల పగ్గాలను పట్టుకొన్నట్లుగాను, పైభాగమున నాల్గువైపుల గణపతి, లక్ష్మి, ఆంజనేయ, సరస్వతులు వెలసినట్లుగాను, ఏనుగులు దండలతోను, హంసలు లతా తోరణముల తోను శ్రీవారి పాదపద్మములను పూజించుచున్నట్లుగాను మలచబడి సర్వాంగసుందరంగా తీర్చిదిద్దబడినది. దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న మహాపీఠంపై శ్రీవారి కొఱకు ఏర్పాటుచేయబడిన సింహాసనమునకు నాలుగు సింహములు కాళ్ళుగాను, సూర్యభగవానుడే ఉత్తర భాగముగాను రూపొందింప బడినవి. దానికి వెనుక భాగమున పాదుకా ట్రస్టువారి చిహ్నము, ఆ పైభాగమున నెలకొల్పబడిన అందమైన ఛత్రము ఆ రథమునకు విశేషమైన శోభను చేకూర్చినవి. శ్రీవారు రథాన్ని అధిరోహించి బయలుదేరగా సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే జగముల వీక్షించుటకై ఏతెంచు చున్నట్లుగా ఉండినది. ఊరేగింపు జరుగుతున్నంత సేపు "ఇప్పుడు నా అవసరమేమీ లేదు కదా!" అనుకొన్నట్లుగా సూర్యుడు ఆకాశంలో మేఘాల చాటున దాగియుండినాడు. స్వర్ణరథముపై శ్రీవారు సాయికుల్వంత్ సభామండపమున కేతెంచగా ముక్కోటి దేవతలు తమ హర్షమును వ్యక్తం చేస్తున్నారా? అన్నట్లు ఒక చిఱుజల్లు కురిసింది. ఆ రథముపై నుండియే శ్రీవారు అభయహస్తములతో భక్తులను ఆశీర్వదించిన దృశ్యమే దృశ్యము. భక్తుల హృదయాలలో ఆనందం ఉప్పొంగింది; ఆనందబాష్పాలు వర్షించని కన్నులు లేవు.

భగవంతుడు శ్రీ సత్యసాయిబాబా అనే పేరుతో చిత్రావతీ తీరమున వెలసియుండి.....ఇదే రోజున.... ఇదే క్షణమున....ఇదే నక్షత్రయుక్త లగ్నమున బంగారు రథము నధిరోహించి భక్తజనులకు దివ్యదర్శనానందము ననుగ్రహించి ఆశీర్వదింతురని వేలాది సంవత్సరాల క్రిందట లిఖింపబడిన శుకనాడీ గ్రంథమునందు వివరింపబడియున్నదని ఈ ఉత్సవాన్ని నిర్వహించిన సాయిపాదుకా ట్రస్టు సభ్యులొకరు ఆనాటి సాయంకాలం జరిగిన సమావేశంలో పేర్కొన్నారు.

శ్రీవారు తమ దివ్యోపన్యాసంలో - భగవంతునికి కావలసింది స్వర్ణరథాలు, బంగారు సింహాసనాలు కాదనీ, భగవంతుడు కోరేది పరిపూర్ణమైన ప్రేమ మాత్రమేననీ అన్నారు. భక్తుడైన సుబ్రహ్మణ్యచెట్టియార్‌గారి చిరకాల వాంఛను నెరవేర్చడం కోసమే తాను రథం ఎక్కవలసి వచ్చిందని వివరించారు. భగవంతుడు భక్తసులభుడు, భక్తపరాధీనుడు కదా! మొత్తం మీద ఈ స్వర్ణరథోత్సవం శ్రీవారి అవతార చరిత్రలోనే ఒక విశిష్టమైన, మహత్తరమైన ఘట్టమని చెప్పక తప్పదు.

*డా॥ ఆర్. గంగాధరశాస్త్రి (ప్రశాంతినిలయం)*

# బలిచక్రవర్తి ఆదర్శం

ప్రేమస్వరూపులారా! ఎవరి హృదయం దయతో కూడియుండునో, ఎవరి వాక్కు సత్యంచేత అలంకరింపబడియుండునో, ఎవరి కాయము పరోపకారానికి అంకితమగునో అట్టి మానవ జీవితమే పరిపూర్ణమైనది. మనోవాక్కాయముల ఏకత్వమే పరిపూర్ణత్వం.

మానవ జీవితం దేని నిమిత్తమై ఏర్పడినది? "పరోపకారార్థ మిదం శరీరం", ఈ శరీరాన్ని స్వార్థ నిమిత్తమైగాక పరార్థ నిమిత్తమై ఉపయోగపెట్టాలి. కాని ఈనాటి మానవుడు స్వార్థం చేతిలో కీలుబొమ్మగా ఆడిస్తున్నాడు. మానవునియందు దివ్యత్వం అవ్యక్తంగా ఉన్నది. కాని తాను స్వార్థంలో మునిగి పోవడంచేత తనలో దివ్యత్వం లేదని భ్రమిస్తున్నాడు. ఈ స్వార్థాన్ని ఏనాడు నిర్మూలించుకుంటాడో ఆనాడే తనలో అవ్యక్తంగా ఉన్న దివ్యత్వం వ్యక్తమవుతుంది. స్వార్థం నిర్మూలం కావాలంటే నిస్స్వార్థసేవ, నామస్మరణ అత్యవసరం.

ఈ ప్రపంచంలో ప్రతి పదార్థమునకు ఒక విలువ ఉన్నది. అడవిలోని చిన్న పక్షికి కూడా విలువ ఉన్నది. జ్ఞానం లేని గొడ్డుకు కూడా విలువ ఉన్నది. కాని మనిషికి మాత్రం విలువ లేకుండా పోతున్నది. కారణమేమిటి? మనిషిలో ఉండవలసిన మానవతా విలువలు లేకపోవడమే! మన ఇంట్లో ఫ్యాన్ వేసుకుంటే దానికి ఖర్చయ్యే కరెంటుకు డబ్బు కడుతున్నాము. ఇంట్లో బల్బు తగిలించుకుంటే దానికి కూడా డబ్బు కడుతున్నాము. కార్పొరేషన్ వారి ట్యాప్‌నుండి నీరు తెచ్చుకుంటే దానికి కూడా తగిన ట్యాక్స్ చెల్లిస్తున్నాము. ఇట్టి కల్పితమైన గాలి, నీరు, వెలుతురుకోసం మనం ప్రభుత్వానికి ట్యాక్స్ కడుతున్నప్పుడు మరి మనకు ఉచితంగా పంచభూతములను ప్రసాదించిన భగవంతునికి కూడా ట్యాక్స్ కట్టాలి కదా! అదే స్మరణ. ఆ స్మరణ కూడా కేవలం శ్రుతి లయ రాగ తాళములతో మాత్రమే కాకుండా హృదయార్పిత భావంతో చేయాలి. రావణుడు నిరంతరము శివ పంచాక్షరీ నామాన్ని స్మరిస్తూ వచ్చాడు. అయినప్పటికీ అతనిలోని రాక్షసగుణములు పోలేదు. కారణమేమిటి? అతడు కేవలం టేప్‌రికార్డర్ మాదిరి ఉచ్చరించాడుగాని, హృదయపూర్వకంగా స్మరించలేదు. రాక్షస కుమారుడైన ప్రహ్లాదుడు నిరంతరము "ఓం నమో నారాయణాయ" అని హృదయపూర్వకంగా స్మరిస్తూ వచ్చాడు. తండ్రియైన హిరణ్యకశిపుడు పెట్టిన బాధల నుండి ఆ నామస్మరణమే అతనిని రక్షించింది. కనుక మీరు కూడా మీ హృదయాన్ని భగవంతునికి అర్పించి నామాన్ని స్మరించాలి. అదే నిజమైన స్మరణ. ఇతరుల మెప్పుకోసమో లేక పేరు ప్రఖ్యాతులకోసమో చేసే స్మరణ సరియైనది కాదు. ఎవరు మెచ్చినా మెచ్చకపోయినా భగవంతుడు మెచ్చుకుంటె చాలు. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి". హృదయపూర్వకంగా దైవాన్ని స్మరించిన వాడు తాను కూడా దైవంగా మారిపోతాడు. కాని ఈనాటి మానవుడు కఠిన పాషాణహృదయుడుగా మారిపోతున్నాడు. మర్మాస్త్రంచేతను, ఇతరులను బాధించడంచేతను, హింసించడం చేతను తన అభీష్టాలను నెరవేర్చుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఇది ఎన్నటికీ సాధ్యంకాదు. తన అభీష్టాలు నెరవేరాలంటే తాను ప్రేమ, శాంతి, సహనాలతో జీవించాలి.

### అన్ని దానములను మించిన దానం

లోకంలో కొందరు భూదానం చేస్తుంటారు, కొందరు గోదానం చేస్తుంటారు, కొందరు అన్నదానం చేస్తుంటారు, కొందరు వస్త్రదానం చేస్తుంటారు. కాని బలిచక్రవర్తి తనను తానే అర్పించుకున్నాడు భగవంతునికి. ఇదే అన్నిదానములను మించిన గొప్ప దానం. అతనిలో మొట్టమొదట నేను చెప్పిన మూడు గుణములు సంపూర్ణంగా నిండియున్నాయి. అతడు తన హృదయాన్ని దయతో నింపుకున్నాడు; తన మాటలలో సత్యమును ఇముడ్చుకున్నాడు; తన కాయమును పరోపకారానికి అంకితం చేశాడు. కనుకనే భగవంతుడు అతనిని అనుగ్రహించాడు. అతడు వామనమూర్తికి తనను తాను అర్పించుకోవడానికి సిద్ధమైనప్పుడు గురువైన శుక్రాచార్యుడు వద్దని అడ్డు తగిలాడు. అప్పుడు బలిచక్రవర్తి, "గురూజీ! పలికి బొంకుట కంటె పాప

మన్నా? ఆడిన మాట తప్పుడవడంటే మించిన పాపం లేదు. కనుక ఎన్ని కష్టాలైనా కలుగనీ, నేనాడిన మాట తప్పను'' అన్నాడు.

**ప్రవర్తన వేషానికి తగినట్లుగా ఉండాలి**

ఒకనాడు భోజరాజు ఆస్థానానికి ఒక పగటివేషగాడు సన్న్యాసివేషంలో వచ్చి వేదాంతాన్ని చక్కగా వివరించి చెప్పాడు. భోజరాజు సంతోషించి ఒక పళ్లెంలో బంగారు వరహాలను పెట్టించి అతనికి ఇవ్వబోయాడు. అతడు వాటిని నిరాకరిస్తూ, ''రాజా! నేను సన్న్యాసిని. సర్వసంగపరిత్యాగిని. కనుక ఇవి నాకు అక్కర లేదు. రేపటి దినము తిరిగి వస్తాను'' అని చెప్పి వెళ్ళిపోయాడు. మరునాడు అదే వ్యక్తి ఒక నర్తకి వేషంవేసుకొని వచ్చి అద్భుతంగా నృత్యం చేశాడు. రాజు మెచ్చి అతనికి కొన్ని వరహాలను బహూకరించబోయాడు. అప్పుడతడు, ''రాజా! ఇవి నాకు చాలవు, ఇంకా ఎక్కువ కావాలి'' అన్నాడు. రాజు ఆశ్చర్యపడి, ''అయ్యా! నిన్న నీవు సన్న్యాసి వేషంలో వచ్చినప్పుడు అసలు వరహాలనే ముట్టనన్నావు. ఈనాడు ఇచ్చినవి చాలవంటున్నావు. ఏమిటి దీని అంతరార్థం?'' అని అడిగాడు. అప్పుడా వ్యక్తి, ''రాజా! వేషమునకు తగిన ప్రవర్తన ఉండాలి కదా! నిన్న సన్న్యాసివేషంవేశాను. కాబట్టి బంగారం వద్దన్నాను. ఈనాడు నర్తకి వేషం వేశాను. కాబట్టి ఇంకా ఎక్కువ కావాలంటున్నాను'' అన్నాడు. ప్రేమస్వరూపులారా! మీరు మానవవేషాలు ధరించారు. కనుక మీరు మానవులుగానే ప్రవర్తించాలి. విద్యార్థి విద్యార్థిగా జీవించాలి. గృహస్థుడు గృహస్థ ధర్మాలను పాటించాలి. సన్న్యాసి సన్న్యాసాశ్రమధర్మాల ననుసరించాలి. కాని ఈనాడు వేషానికి తగిన చర్యలు ఎక్కడా కనిపించడం లేదు. పైన కాషాయం, లోపల కషాయం మంచిది కాదు. గుడ్డలు మారితే సరిపోదు, గుణములు మారాలి.

**ఎవరిపనులు వారు చేసుకోవడం ఉత్తమం**

భోజరాజు కాలంలో ఎవరి పనులు వారు చేసుకొనేవారు. మహారాణి కూడా రాజుకు కావలసినవన్నీ తానే స్వయంగా చూసుకొనేది. వండటం, వడ్డించడం, పాత్రలను శుభ్రం చేసుకోవడం మొదలగు సమస్తకర్మలను గృహలక్ష్మియే చేసేది. పరులతో సేవ చేయించుకోవడం ఎవ్వరికీ ఇష్టముండేది కాదు. కాని ఈ ఆధునిక యుగంలో ఒక ఇంట్లో భార్యాభర్తలున్నారంటే నలుగురు సర్వెంట్స్‌ను పెట్టుకుంటారు. ఒక డ్రైవరుండాలి, ఒక క్లీనరుండాలి, ఒక వంటవాడుండాలి, పాత్రలు తోమే వాడొకడుండాలి! దీనివల్లనే మానవులు సోమరిపోతులుగా తయారౌతున్నారు. ఎవరి పనులు వారు చేసుకోవటంలేదు. చిన్న కర్చీఫ్ ఉంటే దానిని కూడా చాకలివానికి వేస్తారు కొందరు. వారే పిండుకొని ఆరబెట్టుకోవచ్చు కదా! చిన్నచిన్న విషయాలలో ఇతరులపై ఆధారపడటమెందుకు?! ఎవరి పనులు వారు చేసుకోవడం ఉత్తమమైన పద్ధతి.

**భగవంతుడు పంపే నాల్గు ఉత్తరాలు**

ఒకనాడు ఒక రాణీగారు రాజు తలకు చమురు పెడుతున్నారు. రాజుతలలో ఆమెకు రెండుమూడు తెల్లవెంట్రుకలు కనిపించాయి. వాటిని చూసి తన చీరకొంగుతో కన్నీరు తుడుచుకోసాగింది. ఎదురుగా అద్దం ఉండటంచేత రాజుకు ఈ దృశ్యం కనిపించింది. ''రాణీ! ఎందుకు ఏడుస్తున్నావు?'' అని అడిగాడు. ''నాథా! భగవంతుడు మానవుణ్ణి తనవద్దకు రప్పించుకొనే ముందు నాలుగు 'ఉత్తరాలు' పంపిస్తాడు. తెల్ల వెంట్రుకలు వస్తే మొదటి ఉత్తరం వచ్చినట్లే. అనగా ఇంక సంసారసంబంధమైన వాంఛలకు దూరంగా ఉండమని హెచ్చరించడమన్నమాట. తరువాత కన్నులను క్యాటరాక్టు పొర కప్పుతుంది. ఇది రెండవ ఉత్తరము. కొంతకాలానికి నొసలు ముడతలు పడతాయి. ఇది మూడవ ఉత్తరం. ఇంక చివరికి కాళ్ళుచేతులు అదరడం ప్రారంభమవుతుంది. ఇది నాల్గవ ఉత్తరం. నాథా! నీకిప్పుడే మొదటి ఉత్తరం వచ్చిందేనని బాధపడుతున్నాను. మనం ఇక జాగ్రత్తగా ఉండాలి'' అన్నది. రాణిమాటలను రాజు చక్కగా అర్థం చేసుకున్నాడు; స్నానం చేసిన వెంటనే మంత్రిని పిలిపించాడు. ''మంత్రీ! ఇక ఈ రాజ్యాన్ని ఏలవలసిన బాధ్యత నీదే. మేమిరువురం అరణ్యానికి పోయి తపస్సు చేస్తాము'' అన్నాడు.

**'యథా రాజా తథా ప్రజా'**

రాజాజ్ఞ ప్రకారం మంత్రి ఈ విషయాన్ని రాజ్యమంతటా చాటింపు వేయించాడు. ఇంక ప్రజలందరు గుంపులు గుంపులుగా రాజభవనానికి రాసాగారు.

''రాజా! మీరు మాకు తండ్రివంటివారు. ఇంతకాలము మమ్మల్ని కంటికిరెప్పవలె కాపాడుతూ వచ్చారు. మీరు లేకుండా మేము జీవించలేము. కనుక మేమే అడవికి వెళ్ళి తపస్సు చేసి మీ ఆయుఃప్రమాణాన్ని పొడిగించమని భగవంతుణ్ణి ప్రార్థించి వస్తాము'' అన్నారు. రాజు అంగీకరించక తప్పలేదు. ప్రజలంతా అడవికి వెళ్ళి తపస్సు చేశారు. వారి భక్తికి మెచ్చి భగవంతుడు ప్రత్యక్షమై ఏమి కావాలో కోరుకొమ్మన్నాడు. ప్రజలంతా ఏకకంఠముతో, ''స్వామీ! మా రాజు బాగుంటేనే మేము ఆ రాజ్యంలో జీవించడానికి వీలవుతుంది. కనుక మా రాజుకింకా నూరుసంవత్సరాల ఆయుష్షును ప్రసాదించు'' అని కోరారు. ''సరే, ఇచ్చినాను పొండి'' అన్నాడు భగవంతుడు. ఆ ప్రజలు పట్టలేని ఆనందంతో రాజభవనానికి పరుగెత్తుకుంటూ వచ్చారు. ''రాజా! మీరింకా నూరు సంవత్సరాలపాటు జీవించేటట్లు భగవంతుని నుండి వరం పొంది వచ్చాము'' అన్నారు. ఈ మాటలు విన్న తక్షణమే రాణిగారు రాజుకు నమస్కరించి, ''రాజా! ఇక నేను వెళుతున్నాను తపస్సుకు'' అన్నది. ప్రజలందరూ, ''అయ్యో! మనం రాజుకు మాత్రమే నూరు సంవత్సరాలు పొడిగించమని కోరాము కాని, రాణికి కోరలేదు. అందుకే ఆమెకు కోపం వచ్చిందేమో'' అనుకున్నారు పాపం! కాని రాణి భావన అట్టిది కాదు. ఆమె అరణ్యానికి వెళ్ళి తపస్సు చేసింది. భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు. ''స్వామీ! మీరు మారాజుకు ఇంకా నూరు సంవత్సరాల ఆయుష్షు నిచ్చారా?'' అని ప్రశ్నించింది. ''అవును, ఇచ్చాను'' అన్నాడు. ''అయితే రాజు ఉన్నంతవరకు ఈ ప్రజలు కూడా ఉండాలి. ఇలాంటి ప్రజలు లేకుండా అలాంటి రాజు ఉండి ఏమి ప్రయోజనం? కనుక ప్రజలకు కూడా నూరేళ్ళ ఆయుష్షు ఇవ్వాలి'' అని కోరింది. భగవంతుడు ఆమె విశాల భావానికి సంతోషించి, ''అమ్మా! మీరాజుకు నూరేళ్ళు, ప్రజలకు నూరేళ్ళు, నీకు కూడా నూరేళ్ళు ఇచ్చాను, ఆనందంగా పోయిరా'' అన్నాడు. ''యథా రాజా తథా ప్రజా'' ఆనాటి రాజులు విశాల హృదయులు కావడంచేత ప్రజలు కూడా విశాలహృదయులుగా ఉండేవారు. కాని ఈనాడు అట్టి రాజులు గాని, అట్టి ప్రజలుగాని ఎక్కడా కనిపించడం లేదు.

ఈనాడు వామనమూర్తి అవతరించి బలిచక్రవర్తికి మోక్షం ప్రసాదించిన దినము. బలిచక్రవర్తి మహా గొప్పవాడు. కాని అంత మంచివాడు కాదు. ఎందుకంటే అతనిలో అహంకారమనే దుర్గుణం ఉంది. వామనమూర్తి వచ్చి ఆ కాస్త అహంకారమును అణగద్రొక్కి అతడిని తనలో చేర్చుకున్నాడు. బలిచక్రవర్తి రాజ్యంలో ఏనాడూ దుర్భిక్షం లేదు. ప్రజలంటే అతనికి చాల అభిమానం. వారిని తన కన్నబిడ్డలవలె చూసుకున్నాడు. కనుకనే తాను వెళ్ళిపోయే సమయంలో, ప్రతి సంవత్సరం ఈ ఓణం రోజున వచ్చి మిమ్మల్ని చూస్తానని ప్రజలకు వాగ్దానం చేశాడు. ఓణం అనగా అవతరించడమే, క్రొత్త జీవితాన్ని ప్రారంభించడమే. ఈనాటికి కూడా కేరళలో ఒకవైపున నాస్తికత్వం పెరుగుతున్నా మరొకవైపున విష్ణుభక్తి కూడా చాల పెరుగుతూ వస్తున్నది.

''మీటెస్టే నా టేస్ట్''

కష్టసుఖాలు రెండూ ఒకదానినొకటి బ్యాలన్సు చేస్తున్నట్లుగా ఉంటాయి. The pleasure is an interval between two pains. రెండు బాధలమధ్యనే ఒక సుఖముంటుంది; రెండు సుఖములమధ్యనే ఒక బాధ ఉంటుంది.

''కష్టసుఖములు రెండును కలసియుండు
వీని విడదీయ నెవ్వరి వశము కాదు
సుఖము ప్రత్యేకముగ నెందు చూడబోము
కష్టము ఫలించెనేని సుఖంబటంద్రు''

కష్టము లేక సుఖము విలువ తెలియదు. కనుకనే భగవంతుడు అప్పుడప్పుడు కొన్ని కష్టాలను, బాధలను కలిగించి అందరినీ టెస్ట్ చేస్తుంటాడు. టెస్ట్ చేసినప్పుడే మిమ్మల్ని ఉన్నతస్థాయికి పంపించడానికి వీలౌతుంది. లేకపోతే మీరు ఉన్న స్థానంలోనే ఉంటారు. కాని అదేమి దురదృష్టమో ఈనాటి భక్తులు తమను టెస్ట్ చేయవద్దని భగవంతుణ్ణి కోరుతుంటారు. పిచ్చి భక్తులారా! అట్లా కోరకండి. మీ టెస్టే నా టేస్ట్! భక్తులు నిరంతరము తమకు టెస్టులు పెట్టమని భగవంతుణ్ణి కోరాలి. ఎన్ని కష్టాలు పెట్టినా తట్టుకొని నెట్టుకొని ముందుకు సాగిపోవాలి. అప్పుడే మీలో దివ్యత్వం ఆవిర్భవిస్తుంది.

పాండవులు మహారాజులుగా ఉన్నంతకాలం తమలోని దివ్యశక్తిని వారు ఏనాడూ దర్శించలేక పోయారు. పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం, ఒక సంవత్సరము అజ్ఞాతవాసం చేసిన తరువాతనే వారిలోని దివ్యభావములన్నీ బయటికి వచ్చాయి. బావిలో నీరు పైవరకు ఉండే అడుగునున్న వస్తువు మనకు కనిపించదు. నీరు తగ్గితే అడుగుభాగం కనిపిస్తుంది. అదేవిధంగా మనసును కప్పియున్న అహంకార మమకారములను తొలగించుకునేంత వరకు అట్టడుగునున్న దివ్యత్వం మనకు అర్థం కాదు.

ప్రేమస్వరూపులారా! భగవంతుడు అందరిలోను ఉన్నాడనే సత్యాన్ని గుర్తించి మీ ప్రేమను పదిమందికి పంచండి. అదే జీవితలక్ష్యం. మానవ జన్మ దుర్లభమైనది. ఇది ఏనాటికైనా జారిపోతుంది, ఏనాటికైనా కూలిపోతుంది. కాబట్టి మమత్వాన్ని త్రెంచుకొని త్యాగాన్ని పెంచుకోండి. త్యాగమంటే ఏమిటి? ఆస్తి, ఆలి పీడి అడవికేగుట కాదు; దుష్టభావములను వీడుటే త్యాగము, అదియే యోగము. కనుక మీ భావములను మార్చుకోండి. రామానందతీర్థులవారు సన్న్యాసం స్వీకరించి అరణ్యంలో ఉన్న సమయంలో అతని బోధలు వినాలని ప్రజలు గుంపులు, గుంపులుగా వెళుతున్నారు. ఆ గుంపులో అతని భార్య కూడా ఉన్నది. రామానందులవారు ఆమెను చూస్తూనే తలను ప్రక్కకు త్రిప్పుతున్నాడు. అప్పుడామె చెబుతుంది: 'స్వామీ! నేనిక్కడికి వచ్చినది మీరు నా భర్త అనే భావంతో కాదు. మీరు మహనీయులనే భావంతో మీ ప్రబోధను వినాలనే ఆశతో వచ్చాను. కాని మీరు నన్ను చూడగానే తల త్రిప్పుతున్నారు. అంటే నేను మీ భార్యననే భావం మీకింకా పోలేదన్నమాట. భావమును మార్చుకోకుండా సన్న్యాసం తీసుకుంటే ప్రయోజన మేమిటి? ముందు మీ భావాన్ని మార్చుకోండి'' అన్నది. మనలోని దుర్గుణాలను, దురాలోచనలను విసర్జించాలి. అప్పుడు ప్రేమ మనలో దానంతటదే ఆవిర్భవిస్తుంది. మానవుడు సహజంగానే ప్రేమస్వరూపుడు. కాని ఆ ప్రేమను ప్రాపంచిక విషయాలలో ప్రవేశపెడుతున్నాడు. దానిని దైవంపై మరల్చి సర్వకర్మలను భగవత్ప్రీత్యర్థం ఆచరించాలి. అదే నిజమైన త్యాగము. ఇల్లువాకిళ్ళను వదలిపోవడం ఆడంబరమే అవుతుందికాని, త్యాగమనిపించుకోదు. అంతా భగవత్స్వరూపమే అన్న భావముతో జీవించాలి. ''ఈమె నా తల్లి, ఈమె నా బిడ్డ, ఇతను నా కుమారుడు'' అనే భావాలు పెట్టుకొని మీరు ఏమి విసర్జించినా ప్రయోజనం లేదు.

### అభిమానమే దుఃఖానికి మూలం

ఒకానొక వ్యక్తి ఇల్లువాకిళ్ళను వదలి హృషీకేశ్‌కు వెళ్ళి సన్న్యాసం స్వీకరించాడు. ఒకనాడు అక్కడ నది ఒడ్డున ఒక చెట్టు క్రింద కూర్చొని భగవచ్చింత చేస్తున్నాడు పాపం! ఇంతలో అక్కడొక యాత్రికుల బస్సు ఆగింది. బస్సులోని వారు తెలుగులో మాట్లాడుకోవడం విన్నాడు. ఇతడు కూడా తెలుగువాడే కావడంచేత భాషాభిమానంతో వారివద్దకు వెళ్ళి, ''అయ్యా! మీరెక్కడి నుండి వచ్చారు?'' అని అడిగాడు. ''మాది అనంతపురం జిల్లాలోని పుట్టపర్తి గ్రామమండీ'' అన్నారు. ఇతనిది కూడా పుట్టపర్తే కావడంచేత ఇంక గ్రామాభిమానం వచ్చేసింది. ''పుట్టపర్తిలో మీరెక్కడుంటారండీ?'' అని అడిగాడు. ''మా ఇల్లు చిత్రావతీ నదికి పోయే త్రోవలో ఉన్నదండీ'' అన్నారు. ఇతని తండ్రి కూడా అదే ప్రాంతంలో ఉండటంచేత, ''మీ ఇంటి నెంబర్ ఎంతండీ?'' అని అడిగాడు. ''మాది పదవ నెంబర్ ఇల్లు'' అని చెప్పారు. ఇతని తండ్రిది **12**వ నెంబర్ ఇల్లు. ''మా నాన్న **12**వ నెంబర్ ఇంట్లో ఉంటున్నాడండీ. ఆయన బాగున్నాడా?'' అని అడిగాడు. ''పాపం, ఆయన నెల క్రిందటే చనిపోయాడండీ'' అన్నారు. ''అయ్యో! నా తండ్రి పోయాడా!'' అని ఇతడు ఏడుస్తూ కూర్చున్నాడు. ఈ ఏడుపుకు కారణమేమిటి? మొదట భాషాభిమానం వచ్చింది. భాషాభిమానం వస్తూనే జిల్లాభిమానం, జిల్లాభిమానం వస్తూనే గ్రామాభిమానం, గ్రామాభిమానం వస్తూనే ఇంటిఅభిమానం, ఇంటిఅభిమానం వస్తూనే దేహాభిమానం కలిగాయి. దేహాభిమానంచేత దుఃఖం ఏర్పడింది. సమస్త దుఃఖములకు మూలకారణం దేహాభిమానమే. దేహాభిమానమును వీడక ఏ హృషీకేశ్‌కు పోయినా, ఏ హరిద్వార్‌కు పోయినా, ఏ బదరీకి పోయినా ప్రయోజనం లేదు. దేహాభిమానమును తగ్గించుకొని ఉన్నచోటే ఉండండి అదే మీకు మోక్షము నందిస్తుంది.

(**తేది : 14-9-1997** సాయంత్రం సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశమునుండి

# సత్యోపనిషత్

## (గత సంచిక తరువాయి)

58. స్వామీ! ఈనాటి పిల్లలకు పెద్దవాళ్ళు ఏది చెప్పినా, ''నా స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి అడ్డు వస్తున్నారు'' అంటున్నారు. ఏం చేయమంటారు?

బాబా : ఆధునిక యువకులకు స్వేచ్ఛ అంటే ఏమిటో, స్వాతంత్ర్యమంటే ఏమిటో తెలియదనే చెప్పాలి. అర్థం తెలియకుండా పదాలు వాడుతున్నారంతే! అసలు ఏది స్వేచ్ఛ అంటే? పశుపక్ష్యాదుల వలె ఇష్టము వచ్చినట్లు తిని తిరగడమా? అవి కూడా తింటున్నాయి, తిరుగుతున్నాయి, పుష్టిగా పిల్లలను కంటున్నాయి. అటువంటప్పుడు మనిషిస్వేచ్ఛకున్న ప్రత్యేకత ఏమిటి? మీ విద్యలు దేనికోసం? ఆ జంతువులైనా కొంత నయం. ఎందుకంటే వాటికొక రీతి, నీతి ఉన్నాయి. మీకు అవి కూడా లేవు. అసలు ఏమిటి స్వేచ్ఛ అంటే? స్వ + ఇచ్ఛ = స్వేచ్ఛ. స్వ - అనగా ఆత్మ. కనుక ఆత్మయొక్క ఇచ్ఛయే స్వేచ్ఛ. ఇంతటి గొప్ప అర్థం ఇమిడియున్నది స్వేచ్ఛ అనే పదంలో. ఇట్టి స్వేచ్ఛనేనా నేటి యువకులు కోరేది? కానేకాదు. వారికి స్వేచ్ఛ అనే పదానికి అర్థమే తెలియదు పాపం!

ఇంక, ''నాకూ స్వాతంత్ర్యం ఉంది. నా ఇష్టప్రకారం నేనుండకూడదా?'' అంటారు కొందరు. ఇవి కూడా అర్థం తెలియక అనే మాటలే! స్వాతంత్ర్యమంటే విచ్చలవిడిగా తిని తిరగటమా? ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించడమా? కాదు, కాదు. తిరగటమే అనుకుంటే Cats (పిల్లులు), Rats (ఎలుకలు) కూడా జోరుగా తిరుగుతూనే ఉన్నాయి కదా! తిండితీర్థాదులంటావా? నీ లైఫ్ అంతా లోడింగ్, అన్‌లోడింగ్ చేస్తూనే ఉన్నావుగా! మరిదేమిటి స్వాతంత్ర్యమంటే? ఇక్కడ ఒక విషయం గుర్తు పెట్టుకో. నీవు స్వతంత్రుడవే! నీకూ స్వాతంత్ర్యం ఉంది. కానీ ఎంతవరకు? ఎదుటివాని స్వాతంత్ర్యానికి అడ్డు రానంతవరకే! ఉదాహరణకి నీవొక వాకింగ్ స్టిక్ (చేతికఱ్ఱ) పట్టుకొని ఉదయం వాహ్యాళికి బయలుదేరావనుకో! హుషారుగా వాకింగ్‌స్టిక్‌ని ఊపుకుంటూ నీవు నడుస్తున్నావు. వాకింగ్ స్టిక్ నీది. దానిని ఊపటానికి నీకు స్వాతంత్ర్యం ఉంది, కనుక అటూ ఇటూ ఊపుతున్నావు. కానీ ఇది ఎంతవరకు? ఆ దారిలో నీ ప్రక్కన నడిచేవాని ముక్కుకి తగలనంతవరకే, తగిలిందా నీ స్వాతంత్ర్యం పోయిందన్నమాటే! మనకు స్వరాజ్యం వచ్చిందంటున్నాము. అసలు ఏది స్వరాజ్యం? స్వ + రాజ్యం. అనగా ఆత్మసామ్రాజ్యమే నిజమైన స్వరాజ్యం. బాహ్యమైన శత్రువులను జయించి దాస్య శృంఖలాల నుండి విముక్తిని పొందడం రాజకీయమైన స్వరాజ్యానికి సంబంధించినది. కాని ఆత్మసామ్రాజ్యం అట్లా లభించేది కాదు. ఇది మన లోపలి శత్రువులైన కామక్రోధలోభమోహమదమాత్సర్యాదులను జయించినప్పుడే లభిస్తుంది. ఇది అసలైన స్వరాజ్యం, సిసలైన స్వాతంత్ర్యం. దీనిని అర్థం చేసుకోవాలి.

(సశేషం)

# SRI SATHYA SAI INSTITUTE OF HIGHER LEARNING

**(Deemed University)**

Prasanthinilayam - 515 134 (A.P) Phone: (08555) 87239 - Grams: 'SAINSTITUT'

## ADMISSION NOTICE

**Admission for the Academic Year commences from May/June 1998 will be made for the following Courses**

**Prasanthinilayam Campus** (Only for Men) B.A., B.Sc. (Hons) in Mathematics, Physics, Chemistry, Biosciences & Economics, M.B.A., M.F.M. (Master of Financial Management), M.Tech (Computer Science)

**Brindavan Campus** (Only for Men) B.Sc.(Hons) in Mathematics, Physics, Chemistry & Biosciences and B.Com (Hons)

**Anantapur Campus** (Only for Women) B.A., B.Sc (Home Science), B.Sc (Hons) in Mathematics, Physics, Chemistry, Botany & Zoology, B.Com (Hons), M.A. (English), M.A. (Telugu), M.Sc (Home Science) and B.Ed

**Eligibility for Admission (For Under Graduate Courses):** 10+2 pattern of study / Intermediate
Minimum marks required in the X Std examination is 60% in the aggregate and 55% in General English. They should have taken their final year +2 / Intermediate qualifying examination before the date of Admission Test.

**Eligibility for Admission (For Post-Graduate Courses including M.B.A., M.F.M., and B.Ed.):** 10+2+3 pattern of study
**Post Graduate** First class (a minimum of 60% marks in aggregate in all the three years of study) in respective degrees, with 50% in General English.
**M.B.A./M.F.M. and B.Ed.** First class (a minimum of 60% marks in all examinations of the course) in any first degree or Post-Graduate degree with 50% of marks in General English in the first basic degree. The minimum requirement of 50% of marks in General English is exempted for candidates of Technical Courses like - B.E., B.Tech., B.Pharma., B.Sc.(Agri) etc. for M.B.A./M.F.M. Candidates.

**Eligibility for Admission (For M.Tech. Computer Science):** First class (60% and above) both in the first degree and M.Sc.(Mathematics) / M.Sc.(Physics) / M.Sc.(Computer Science) / B.E. / B.Tech levels of examination with Computer Science as background.

In the case of candidates who have not received the marks statements of the final year of the first degree examination, their marks in the previous years/semesters should be 60% in aggregate and 50% in General English. They should have taken their final year/semester qualifying examination before the date of the admission test.
Admission to all the above Courses will be on the basis of Admission Test and Interview which will be held in May 1998, at PRASANTHINILAYAM, A.P.
Application form along with Information Handbook will be available from **November 25th, 1997** to **February 20th, 1998.**

Interested candidates may apply to the Registrar, **SRI SATHYA SAI INSTITUTE OF HIGHER LEARNING**, Prasanthinilayam 515134, Anantapur Dt., A.P. along with I.P.O. or Bank Draft for Rs. 50/- for Undergraduate Courses and Rs.70/- for Post Graduate Courses/M.B.A./M.F.M./M.Tech.(Computer Science)/B.Ed. Courses. The draft should be drawn in favour of **SRI SATHYA SAI INSTITUTE OF HIGHER LEARNING** payable at **Prasanthinilayam.**
Since the application-forms are different for each programme, candidates must indicate in the requisition letter the details of course/subject of study for which they seek admission. Also, the name and postal address of the candidate should clearly be mentioned in the requisition.

**REGISTRAR**

